# ముద్రణాపయిత్రి



## స్వర్గీయ సింహాద్రి వేంకట రత్నమ్మ గారు

(21.09.1932 - 02.01.2021)

అమ్మలు నింటనింటఁ గల రమ్మ పదమ్మున కీవె రూపువౌ
నమ్మలు కన్న బిడ్డలను నాలన పాలన సేయుటద్ది సా
జమ్మగుఁ గాని నన్ను సుతసామ్యత వర్థిల నోమినట్టి ర
త్నమ్మ విదేమి పూర్వజను వందలి బంధమొ తల్లి! యెంచగన్.

నాకు మాతృసమానురాలై కుమారుని వలె ఆదరించిన, సదా నా అభ్యుదయమును కాంక్షించిన, స్వర్గీయ సింహాద్రి వేంకటరత్నమ్మ గారు ఈ గ్రంథమునకు ముద్రణ దాత్రి. ఆమె చిరకాలము ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో కృష్ణాజిల్లా, అవనిగడ్డ నియోజకవర్గ శాసనసభ్యులుగా మంత్రివర్యులుగా, నిష్కళంక జనప్రియ రాజకీయవేత్తగా సుప్రసిద్ధులైన కీ.శే. సింహాద్రి సత్యనారాయణరావు గారి ధర్మపత్ని. ఆ అమ్మకు వైకుంఠవాసుడు సద్గతులు ప్రసాదించు గాక. వారి తనయులు, ( సౌమ్య మల్టీ స్పెషాలిటీస్, కార్ఖానా, హైదరాబాద్ నిర్వాహకులు ), డా. సింహాద్రి చంద్రశేఖరరావు ( సుప్రసిద్ధ కేన్సర్ శస్త్ర చికిత్సా నిపుణులు ), కోడలు డా.నిర్మల ( సుప్రసిద్ధ ప్రసూతి చికిత్సా నిపుణురాలు ), మనుమరాలు చి.ల.సౌ. డా. సౌమ్య ( కేన్సర్ శస్త్ర చికిత్సా నిపుణురాలు ), మనుమడు చి. రామ్ చరణ్ ( న్యాయవాది ), వారి కుటుంబ సభ్యులను అలర్మేలుమంగా సమేత శ్రీ వేంకటేశ్వర స్వామి సదా తన దివ్యానుగ్రహమునకు పాత్రుల జేసి ఇష్టకామ్యార్థ సిద్ధి నొసగి కాచు గాక!

ఓం నమో వేంకటేశాయ.

– కవితా ప్రసాద్

# శ్రీ వేంకటేశ్వర ద్విశతి

*కవితా ప్రసాద్*

**'శంకరాభరణం' ప్రచురణలు**



శంకరాభరణం

శరణం పండిత మానసాపహరణం, శశ్వద్యశఃకారణం, సరసానందద వాగ్విలాస చరణం, శబ్దార్థ సంపూరణమ్।
చరదత్యద్భుత సత్కవీశ్వరగణం, సాలంబనం 'శంకరాభరణం', నిత్యమహం స్మరామి విలసద్ వాగ్దివ్యసింహాసనమ్ ॥

**శ్రీ వేంకటేశ్వర ద్విశతి**

రచన

**కవితా ప్రసాద్**



ప్రథమ ముద్రణ : జూన్ 2021

ప్రతులు : 100

వెల : అమూల్యం

'శంకరాభరణం' ప్రచురణలు : 47

ప్రాప్తిస్థానం :
Kavitha Prasad,
73-18-8/1F, S2 - Sree Nandanam Apt.,
Sree Balaji St., (Near Venkateswara Temple),
A.V. Apparao Road,
Rajamahendravaram-533103 (AP)
Phone : 9490168907

డి.టి.పి. : కంది శంకరయ్య (7569822984)

కవర్ డిజైన్ : విట్టుబాబు (85550 82034)

ముద్రణ : ముద్రికా ప్రింటర్స్, విజయవాడ



మహామహోపాధ్యాయ, విద్యావాచస్పతి, లేఖారత్న
**శ్రీ శలాక రఘునాథ శర్మ**
రాష్ట్రపతి పురస్కార గ్రహీత,
పూర్వ ప్రాచార్య & డీన్, పూర్వ ఎకడమిక్ సెనేట్ సభ్యులు
శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయము
(అనంతపురము)

# అభినందన

శ్రీ కవితా ప్రసాద్ గారి "శ్రీ వేంకటేశ్వర ద్విశతి" ముచ్చటగా ఉన్నది. ఇందులో ముఖ్యంగా భక్తితుందిలమైన వారి హృదయం ప్రతి పద్యంలోను గోచరిస్తున్నది. శ్రీ వేంకటేశ్వర స్వామిలో వారు ప్రధానమైన దశావతారాలను దర్శిస్తున్నారు. పాఠకులచేత దర్శింపజేస్తున్నారు. చక్కని భావనిర్భరమైన తత్త్వమసి మొదలైన మహావాక్యార్థాల సమన్వయం ఇందులో గోచరిస్తున్నది. ఈ రచన ద్వారా వారు త్రికరణాలను సంస్కరించుకొని, పాఠకులకు ఆ సంస్కరణ విధానాలెలా ఉంటాయో తెలియజేస్తున్నారు. ప్రస్తుత కాలమాన పరిస్థితులలో షడ్గుణ్యైశ్వర్య భరితమైన భగవత్తత్త్వం రూపురేఖలను సులభంగా అందరికీ అందించటానికి ఈ శతకరచన ఎంతో ఉపయోగపడుతుంది. శ్రుతి స్మృతి పురాణాల సారభూతమైన వాక్యాలెన్నో యీ ద్విశతకంలో వెలుగురేఖల్లా గోచరిస్తున్నాయి. 48 వ పద్యంలోని నీల శరీరతత్త్వం అనంతత్వానికి స్ఫోరకంగా పెద్దలు చెప్పినదానిని వీరు వక్కాణించారు. ధ్రువుడు, ప్రహ్లాదుడు అను బాలభక్తుల ప్రస్తావన తెచ్చి భగవదనుగ్రహం పొందటానికి జాతి, వయస్సు మొదలైన వాని ప్రాభవంతో పనిలేదనే విషయాన్ని ప్రస్తుతించారు (65). నామస్మరణ కంటె మరొక ఉపాయం భవతరణానికి లేదనే సత్యసూక్తిని చక్కగా ప్రకటించారు (68). శివకేశవాభేద తత్త్వాన్ని సమన్వయించారు (73,104). దురహంకారం

పనికిమాలినతనాన్ని సమర్థంగా తెలియజేసారు (106). నరుల అల్పత్వాన్ని తెలియపరచే "కసవును మేసి" (139) పద్యం చాల హృద్యంగా ఉండి నా మనస్సును ఆకట్టుకున్నది. పఠితలకు యిటువంటి హృద్యమైన పద్యాలు యీ ద్విశతిలో మిక్కిలిగా లభించగలవు.

ఈ రచనను అధ్యయనం చేసేవారికి ఇతిహాస పురాణాల రూపురేఖలు మనోవీధిలో కదలాడుతూ ఉంటాయి. ఇది ఒక చక్కని ప్రణాళికతో రూపొందించిన చక్కని రచన. 'సూక్ష్మంలో మోక్షం' అన్నమాట ఈ ద్విశతి చదువుతున్నంతసేపు నా మనస్సులో కదలాడినది.

శ్రీ కవితా ప్రసాద్ గారిని మనసారా అభినందిస్తున్నాను. ఆశీర్వదిస్తున్నాను.

రాజమండ్రి

05-07-2020

**శలాక రఘునాథ శర్మ**





'సమస్యా పృచ్ఛక చక్రవర్తి'
**కంది శంకరయ్య**
'శంకరాభరణం' సమూహ నిర్వాహకుడు,
వరంగల్లు.

# ఇది కవితా ప్రసాదమే!

'కలౌ వేంకటనాయకః' అన్నారు. సప్తశైలవాసియై, ఆపద మ్రొక్కులవాడుగా ప్రసిద్ధుడై భక్తపరిపాలన చేసే శ్రీ వేంకటేశ్వర స్వామిపై వచ్చిన శతకాలకు లెక్కలేదు. ఎవరు ఎలా పిలిచినా పలికే కలియుగ దేవుడు ఆయన. అందుకే కవిగా కలం పట్టిన ప్రతిఒక్కరు ఆ స్వామిపై తమదైన శైలిలో పాటనో, పద్యాన్నో, గ్రంథాన్నో రచించడానికి ఉత్సాహాన్ని చూపుతారు. అదే విధంగా మన కవితా ప్రసాద్ గారు 'వేంకటేశ్వరా!' మకుటంతో తమ భక్తిని, ఆర్తిని, భగవల్లీలను వివరిస్తూ శతక రచనతో తృప్తి పడక ఏకంగా ద్విశతిని రచించారు.

కవితా ప్రసాద్ గారు కవిగా లబ్ధప్రతిష్ఠులు. బహుగ్రంథకర్తలు. అంతర్జాల సాహితీ సమూహాల్లో చురుకుగా పాల్గొంటూ విరివిగా పద్యరచనలు చేస్తున్నారు. వీరు రచించిన ఈ గ్రంథం వీరి భాషాపాండిత్యానికి, పద్యరచనానైపుణ్యానికి ప్రబల తార్కాణం. అలతి యలతి పదాలతో సరళ సుందరంగాను, దీర్ఘసమాసాలతో ప్రౌఢంగాను పద్యాలను వ్రాయడంలో దిట్ట. పద్యాలు ఎక్కువగా ఆత్మాశ్రయాలై, ఆర్తిని భగవంతునికి నివేదించిట్లుగా ఉన్నాయి. అక్కడక్కడ వ్యాజనిందలూ ఉన్నాయి. నవవిధ భక్తి మార్గాలకు ఉదాహరణలుగా ఎన్నో పద్యాలు కనిపిస్తాయి. అద్భుతమైన ధారతో, సముచిత సమర్థ పదప్రయోగాలతో, సుమధుర భావాలతో అందరినీ రంజింపజేసే సుమధుర కవితా ప్రసాదమే ఈ గ్రంథం. ఇంత మంచి పుస్తకానికి డి.టి.పి. చేయడం నా అదృష్టం. కవితా ప్రసాద్ గారికి నా అభినందనలు.

**కంది శంకరయ్య**





## Dr. SLV ఉమా మహేశ్వర రావు

సంస్కృతాంధ్ర పండితులు, సాహితీ వేత్త

నెల్లూరు

ఇంత రమ్యమైన, జటిలమైన పదబంధాలను ఉపయోగిస్తూ వాటిని ఛందస్సులో ఎలా ఒదుగుతారో కదా! నిజంగానే ఆ చదువుల తల్లి కటాక్షం కంఠ దఘ్నంగా మీకు అంది ఉండాలి! 'వియన్నదీ జనక' పద ప్రయోగం చాలా బాగుంది. మీ వంటి విద్వన్మిత్రుల పరిచయం మహద్భాగ్యం. ధన్యవాదాలు.





## Dr. రామడుగు వేంకటేశ్వర శర్మ

ప్రసిద్ధ కవి, పండితులు

గుంటూరు

కవితా ప్రసాద మీ కృతి
కవితలకె ప్రసాదమగు వికాసము గూర్చున్;
నవయోగ భక్తి సంస్కృతి
పవనము శతకమ్ము ప్రౌఢ భావనము; నతుల్.



# శతకోద్భవము

రెండేండ్ల క్రితము ఏడుకొండల స్వామి మీద ఒక కవితా సంపుటిని ప్రచురించాలని కొందరికి ఒక సత్సంకల్పం కలిగి కవుల రచనలను ఆహ్వానించారు. నేనూ ఒక అయిదు పద్యాలను పంపాను. ఎందువలననో వాటిని నిర్వాహకులు స్వీకరించలేదు. 2019 లో ఆ పుస్తకావిష్కరణ తర్వాతనే ఆ విషయం తెలియవచ్చింది. ఆ సమయంలో నేను హైదరాబాదులో నాచారంలో కొంతకాలం గడుపుట సంభవించింది. దాదాపు ప్రతిరోజూ సాయంత్రాన అక్కడి శ్రీ వేంకటేశ్వర స్వామి వారి ఆలయానికి దర్శనానికి పోతూ ఉండేవాడిని. ఒకనాడు స్వామి సమక్షంలోనే ఆ అయిదు పద్యాలను శతకంగా పెంచాలనే ఆలోచన మదిలో కదలాడింది. స్వామి సంకల్పమే అనుకొని నమస్కరించాను. నాకు వచ్చినంతలో శతకాన్ని పూర్తి చేయగలిగాను. పాండిత్యంలో అల్పుడను కాబట్టి సంస్కరణార్థం ఒక మహాపండితుని అర్థించాను. మనమొకటి తలిస్తే దేవదేవుడు మరొకటి తలిచాడు. వారు బహువ్యాపకులగుట వలన ఒక ఏడాది దాటినా అది వారి దృష్టినుంచి మరుగున పడి పరిశీలనకు నోచుకొనబడలేదు. మధ్యలో కోవిడ్ కలకలం తోడైంది. ఈ ఏడాది జాగులో స్వామి అనుగ్రహంతో మరొక వంద పద్యాలు తోడై ద్విశతిగా పరిణామం చెందినది. ఇంతకు ముందు నాకు చేతనయినట్లు రాజశేఖర శతకం అనేది ఒకటి శివానుగ్రహంతో వెలువరించబడినది. ఇప్పుడు శ్రీవేంకటేశుని అనుగ్రహంతో యీ ద్విశతి ప్రకటితమౌతున్నది. పరమాత్మను శివకేశవ రూపాలలో స్మరించే భాగ్యం సంభవించింది. ఇక ఈ ద్విశతిలో ప్రత్యేకత ఏముంది అంటే మాటాడటం మొదలు పెట్టిన ప్రతి శిశువు అత్త అన్నట్లు పద్యం వ్రాయటం వచ్చినదనుకొన్న ప్రతివాడూ శతకం వ్రాయటానికి ఉద్యుక్తుడవుతాడు. ఇదీ అంతే. దేవదేవునితో నేనూ ఓ నాలుగు ఊసులాడాననే ఒక భావన.

నా అభ్యర్థనను అంగీకరించి ఈ ద్విశతిని ఆమూలాగ్రము నిశితముగా పరిశీలించి తగు సూచనలను చేసి, వారి అభిప్రాయమును, ఆశిషమును దయచేసిన ప్రాచార్యులు మహామహోపాధ్యాయ బ్రహ్మశ్రీ శలాక రఘునాథ శర్మ గారి చరణాబ్జ యుగమునకు బహు వందనముల నొనర్చుచున్నాను.

దొసవుల నుడుచుటకు పొసగు నొఱపుల నిడిన "నూఱు కుదురాటగండ" బమ్మసిరి డా. పాలపర్తి శ్యామలానంద ప్రసాదు గారికి దండిగా దండములు.

ఆత్మీయాభిప్రాయమును ప్రకటించిన డా. ఉమామహేశ్వర రావు గారికీ, డా. రామడుగు వారికీ బహు కృతజ్ఞుడను.

అలాగే తమ సూచనలను, అభిప్రాయము నందించి, అందంగా DTP చేసిన కవిపండితులు, మాన్యులు, సుప్రసిద్ధ 'శంకరాభరణం' శ్రీ కంది శంకరయ్య గురుతుల్యులకు నా హార్దిక నమస్సులను అర్పిస్తున్నాను. సుందరముఖపత్ర కల్పన చేసిన శ్రీ విట్టుబాబు గారికీ నా ధన్యవాదములు.

నెఱసులెన్నబడని కవిపుంగవులు లేనే లేరనుట అతిశయోక్తి కాదు. నేనెంత వాడను. వారి విషయంలో అవి ప్రమాదజనితములే కాని నావంటి వారి విషయంలో అల్ప పాండిత్య ఫలములు. పఠితలు సహృదయులై మన్నింతురు గాక యని విన్నవించుకొంటూ విరమిస్తున్నాను.

రాజమహేంద్రవరము. — బుధజనవిధేయుడు

20-06-2021 — **కవితా ప్రసాద్**



# మంగళాచరణము

శ్రీ గణనాథుఁ గొల్తు ఘన శీతధరాధర నప్త నెంచి యీ
వేగతి వీతవిఘ్నకృతి యీశతకంబవు రీతి సల్పగా
హే గజకర్ణ! పండిత కవీంద్ర సుకర్ణరసాయనంబుగా
వాగనుసృష్టిఁ జేయఁ బ్రతి పద్యము నాశిషమీయ వేడెదన్!
(నప్త = మనుమడు)

కం. విద్యాదేవీ! మత్కృ
త్యాద్యంతాంతరకవిత్వహలభూతిఁ గడున్
హృద్యంబగు పద్యంబుల
సద్యఃస్ఫూర్తి వెలయించు చార్విని డఁగదే!
(చార్వి=ఊహాపోహక్షమమైన బుద్ధి)

సీ. మా యూ రవనిగడ్డ మా గ్రామదేవత
లంకమ్మ తల్లినిఁ బ్రస్తుతింతు
రాజరాజేశ్వరీ రాజశేఖరులకున్
లక్ష్మి నారాయణులకు నతింతు
కులదైవములఁ దెల్తు గురునాథమూర్తినిఁ
గామేశ్వరీమాత నోముమంచు
శ్రీచక్ర సామ్రాజ్ఞి శ్రీలలితాపరా
భట్టారికామాతృపదములఁ దల
తే.గీ. నాన్చి శరణమర్థింతు నాయమ్మ కరుణఁ
గలిని భక్తుల కొంగుబంగారమైన
యేడుకొండల రేనిపయి నొక ద్విశతిఁ
గూర్చు సంకల్పసిద్ధి పైకొనఁగ నాకు!

మ. కవితావంశపయోధిపూర్ణశశి ప్రజ్ఞాశాలిజోస్యుండు బ్ర
హ్మవిచారాత్ముఁడు శ్రోత్రియోత్తముఁడు సంప్రాప్తార్థసంతృప్తుఁడున్
భవమోక్షాతురభావసంయుతుఁడు విప్రశ్రేణిసమ్మాన్యుఁడున్
కవితాజ్యోతిష దేశికున్జనకునిం 'గామేశ్వరుం' గొల్చెదన్!

కం. అక్షరవిద్యనిడిన ప్ర
త్యక్షసరస్వతి జనకున కభివాదంబుల్!
శిక్షాభిక్ష త్వదీయమ
నుక్షణ రక్షగ నడిపె ననుం గామేశా!

ఉ. కైతల రామమార్గణము, గాచెను బద్య కవిత్వపు న్నిధిం
ద్రాతగ నెల్లి వేపడగలన్, స్ఫటికాచల సన్నిభాత్ముఁడై
యీ తెనుఁగందు స్వీయ కవితేష్టిని సద్రస సోమపానభా
గ్యాతిశయమ్ము నెల్లరకు నందగఁ బంచిన విశ్వనాథ సం
జాతునిఁ గల్పవృక్ష కవి సత్యునిఁ దెల్తు సభక్తికమ్ముగన్.



# శ్రీ వేంకటేశ్వర ద్విశతి

శ్రీహృదయాధివాస! సిరి లెక్కల మున్గి సదా స్వకీయమం
దైహికచింత మాని నిను నడ్గులఁ బట్టి భజించి దాసదా
సోఽహమటంచు ముక్తిఁ బడయంగ నుపాయము మాకుఁ జూపు నీ
సౌహృదమెంత దొడ్డదయ స్వామి! నమస్సులు! వేంకటేశ్వరా! 1

ఝుల్లిక సాయుఁ దీర్థమున స్నానమొనర్ప బుడుంగు మున్గగా
నుల్లము నింకియున్న కలుషోద్వృతి నెట్లడగించెనౌను? హా!
తెల్లమయెం జెమీ యది! త్వదీయ పదాంబుజ తీర్థ సేవనం
బల్లదియే కదా శరణమందుకు రూఢిగ! వేంకటేశ్వరా! 2
(ఝుల్లిక=మాలిన్యము)

నీ పరమాంఘ్రికంజములు నేలను దాఁకవు వేల్పుపాటియై!
నీ పద పాంసువుం బడసి నెన్నుదుటన్ ధరియింప నౌనెటుల్?
నీ పదరాజమంటి ధరణీధర చేతుల నొత్తుచుండగా
నాపయి రాల్పుమయ్య విడనాడిన ధూళిని వేంకటేశ్వరా! 3

**ఉత్సాహ**

కన్నులు గమలములు, చరణకరములుఁ గమలములు, పై
నెన్న వదనమును గమలము, నేర్చె విధికిఁ గమలమున్
దన్ను, సతియుఁ గమల, మద్ధృదయ కమల నివాసియై
యున్నఁగద సమంజసముగ నొప్పు వేంకటేశ్వరా! 4

సురలను గాచేటే కతము సుమ్మవతారములెన్నొ తాల్చఁగా
హరి! యని మర్త్యలోక జనులాడెడి మాట లవాస్తవంబనం
దిరుమలఁ దిష్ఠవేసి ధరణీకమలాసతులుండఁ బొందునన్
నరులకుఁ గొంగుబంగరయినావ కృపామతి! వేంకటేశ్వరా! 5

శ్యాలకుఁ గంటిపాపగ నహర్నిశ లెవ్విధిఁ గాచుచుంటి, వి
ల్లాలు వృషాకపాయి నెదహత్తుక ప్రేముడి నిల్పుకుంటి, వీ
నేల బసాలినిం గడుపు నించి సురక్షణ నిచ్చుచుంటి వా
పోలిక నన్నుఁ బ్రోవఁగదె పూని మనంబున వేంకటేశ్వరా! 6
(బసాలు = ఇల్లాలు)

మన్ను తినంగ నేటికని మాత యశోదమ మందలించెగా
కన్నయ! ద్వాపరాన నిను కారణకార్య వివేక హీనయై!
మన్ననసేయ భూసతిని మక్కువ ముద్దిడు క్రీడయంచు నీ
మిన్నతనంబు లేమెఱుక! మేటివి మాయల వేంకటేశ్వరా! 7

పాలన సేయ లోకముల బాధ్యత నీకు విధాయకంబు గాన్
మాలితివేల? నీ సఖులు మానిరె సృష్టిలయాది వృత్తులన్?
మీలిత పుండరీకసిత నేత్రయుగంబును విచ్చి కావర
మ్మాలికి బిడ్డకుందినుప నన్నము మేలవొ! వేంకటేశ్వరా! 8

**ఉత్సాహ**

పిడికెఁడు మెతుకులఁ దిన నగుపింతుము గద తుంది కై
వడిఁ! గడునిడుములఁ బడెదము పరిమితి నడయంగ, నీ
కడుపునఁ బదునాల్గునౌ జగంబులుండి, హరి కటిం
బడయ నెట్టులయ్యె సంభవంబు వేంకటేశ్వరా! 9
(తుంది = బాన పొట్ట వాడు)

నీ విల కేల వచ్చితివి? నీ హృదయేశ్వరి కోసమే కదా!
నీవలె మేముఁ జేయ నది నేరమ! చౌక్కునఁ జిక్కుకొంటిమా!
దేవతలైన నీతుల కతీతులొ? కట్టుపకాసు రూపునన్
నీవిటు మాఱుమాటనఁగ నేరక దాఁగితె! వేంకటేశ్వరా! 10
(కట్టుపకాసు = నిశ్చలుడు)

తెలియఁగ రాక నిర్గుణవిధి న్నిను భక్తులు చింతనొందుచేం
దలఁపఁగ నొక్క రూపమును దర్శనమొంద గుణాత్మకంబుగా
వెలసితి వీవు సప్తగిరి విగ్రహమయ్యుఁ బునర్వివాదమే
కలిగెఁ ద్వదీయ లింగమిదికా దది యంచును వేంకటేశ్వరా! 11

పాదము లద్వితీయ భవభారవిమోచక తీర్థరాజముల్
పాదము లద్భుతాఘపరివర్జక పాంశుపరాగ పద్మముల్
పాదము లబ్ధిరాజసుత బ్రహ్మల హస్త నిషేవితంబులా
పాదములంటు భాగ్య మనుభావ్యము సేయవొ వేంకటేశ్వరా! 12

పాదము భస్మశాయికిని భర్తృసమాగతిఁ గూర్చె నాదృతిన్
బాదము పుట్టువై త్రిపథవాహినిఁ జేసె నఘాంతకాపగన్
పాదము ద్రోసి దైత్యవిభుఁ బాప జగంబున కిచ్చె సద్గతిన్
పాదమదే ప్రపత్తి యని ప్రజ్ఞనెఱింగితి వేంకటేశ్వరా! 13

పాదమునొత్తి పాదమునఁ, బట్టి కరాంగుళులం ద్రివక్రనున్
గౌదను బైకినెట్టి, శుభగాత్రినిఁ జేసి సుఖంబు నిచ్చుటం
దేదయఁ జూపినాఁడవొ యదించుకఁ జూపి మదాత్మ వక్రతా
చ్ఛేదము సేయరాఁగదొ విశేషకృపాకర! వేంకటేశ్వరా! 14

కౌగిలిఁ గ్రాగి నీదు కటి కాయమునంటి మనంబులో నఘ
త్యాగము నొంది గోపులు సితాంబుజ చేందము స్వచ్ఛభావుకుల్
కాఁగలిగెం గదా మృదుశిఖండక భూషణ! నీలిమందుతోఁ
గ్రాఁగిన పాతలందినటు గౌరవికాసము వేంకటేశ్వరా! 15

భృగుదులి పాదమొత్తి, పదదృక్కును నొక్కి, యహంబుఁ ద్రుంచి, జ్ఞా
నగతి ననుగ్రహించిన యనర్ఘ కరాంబుజయుగ్మ మెత్తి నా
సిగపయి నొక్కతూరటు స్పృశించి నశింపఁగఁ జేయరాద నా
యగణిత పాపసంచయము నార్తభయాపహ! వేంకటేశ్వరా! 16

నీ తిరురామనామ జపనిష్ఠ సతమ్ము చెలంగినట్టి సా
కేతజనాళి పాపములఁ గ్షీణముసేసి దివంబొసంగి యా
త్రేత నయోధ్యలోని జగతీసమవాయముఁ బ్రోచినట్లు నా
ప్రాఁతటికంపుఁ బుట్టువుల పాపముఁ బాపవొ వేంకటేశ్వరా! 17

సోమకుఁ దేర్చి వేదముల శుభ్రికొసంగిన చేతులెవ్వి! సం
గ్రామరథంబుఁ ద్రోలి జయలాభముఁ గూర్చిన చేతులెవ్వి! గో
స్వాముల కాపుగాయ గిరిభారము నూనిన చేతులెవ్వి! యా
నీ మృదుహస్తముల్నను పునీతునిఁ జేయుత వేంకటేశ్వరా! 18
(శుభ్రి = బ్రహ్మ)

రోటికి బందిసేసి నిను లోటిక రాదని నందపత్ని యా
రాటము వీడి లోఁ జన, విలాసముగాఁ బడఁ గూల్చి మద్దులన్
మాటున నా కుబేరుని కుమారుల శాపముఁ దీర్చినాఁడ వా
బాటను నన్ను దుష్కృత విబద్ధునిఁ జేయవొ వేంకటేశ్వరా! 19

పరశువుఁ జేతఁ బూని పితృవాక్పరిపాలన ధర్మమెంచి త్వ
త్కరముల ఛిన్నమస్తకగఁ దల్లినొనర్చి పరా స్వరూపిణిన్
దరిసెనఁపున్ సిరిం గొనిన దైవత భార్గవరామరూప! య
క్కరణిని నాయహంకృతిని ఖండన సేయవొ వేంకటేశ్వరా ! 20

ఏడవు కొండలెక్కి నరులిచ్చేటి కెందరు వత్తురంచు నీ
వాడను నక్కియుంటివొ! ప్రయాసము దప్పునె మాకు దేవ! వా
నీఁడి ఋణమ్ము నుండి నిను నిర్వృతుఁ జేయగ రాక తప్పునే!
క్రీడయ కాక శ్రీహృదునికిన్ సిరి లోటొకొ వేంకటేశ్వరా! 21

విదురుఁడు పండుగుజ్జడఁచి పెట్టిన తొక్కను తింటి వీవు! నీ
కొదవెను దృప్తి గుప్పెడటుకుల్దిన నేస్తి కుచేలు కొంగునన్!
ముది శబరేవొ పండ్లఁ గడుపుం గుడుపం దనియించి తీవు! త
త్సదృశుల భక్తి శూన్యుఁడను సాఁకుము నన్నును వేంకటేశ్వరా! 22

కారము లెన్నొ నాయెడఁ బ్రగాఢనిగూఢ సమాశ్రితాలహం
కారవికార దుర్గుణ వికర్షణమొల్ల దెఱుంగుదుం బరి
ష్కారము ద్వత్కృపేక్షణ వికాసము! నీదు మహత్వ మంగళా
కార నిబోధనంబు గలుగం గరుణించవొ వేంకటేశ్వరా! 23

జ్ఞానము నందగా నుపనిషత్తుల వేదపురాణవాక్పరి
జ్ఞానము లేశమేనియును స్వాంతమునం గల వాఁడఁ గాను! నా
మానము నేను బోదును! రమాధవు నామజపంబు సర్వమన్
జ్ఞానమదొక్కటే కలదు! కావగ రావయ వేంకటేశ్వరా! 24

వారిజనాభ! కంజుడు భవత్పద తామరసంబునంటి యో
మారు త్రివిక్రమాకృతిఁ గమండలు నారము సేతఁ గడ్గగా
గారవమొప్ప నయ్యెనది గాంగజలంబుగ! మోసె రుద్రుడా
ధారలహో! భవచ్ఛివపదస్వమహత్వము! వేంకటేశ్వరా! 25

కడచిన పుట్టులేవొ యెఱుగన్సుమి! యిప్పటి జన్మమందునన్
విడువక ధర్మమార్గము వివేకవిధంబుఁ జరించేనట్లు నా
నడవడిఁ దీర్చిదిద్దుమ వినా భవదీయ దయాసువృష్టి నా
యెడ నఘకర్మవర్తన నశింపఁ దరంబొకొ వేంకటేశ్వరా! 26

పట్టము గట్టితీవు నిజ భ్రాతృకుమారులకున్ సమంబుగా
నెట్టి విభేదముంచేక మహిన్ రఘురాముఁడవై! యెఱింగి తా
నట్టి సుధర్మపాలన నయంబునఁ జేయక గ్రుడ్డిఱేఁ డిసీ!
గిట్టగఁ జేసి వంశ మపకీర్తినిఁ బొందెగ వేంకటేశ్వరా! 27

ఎవరికి నెంతప్రాప్తమదె యిత్తునటంచును గీతబోధలోఁ
జివరకుఁ దేల్చి చెప్పితివి! చింతలవంతలఁ జిక్కి శల్యమై
దవథువు నూడ్చఁ బట్టగఁ బదంబుల ధర్మమ యట్లు నుద్వగా
నవసర మీకు భక్తులయ యప్పును దీర్పఁగ వేంకటేశ్వరా! 28
(దవథువు = బాధ)

ఆయువు దీరినంత జనులందరు గిట్టుట ప్రాయికంబయిన్
మాయక వచ్చు వెన్వెనుక, మాతను వెన్నడి లేఁగదూడ యం
బా యని పోవునట్లుగ, దురాచరణార్జిత దుష్ఫలంబులున్!
కాయవొ సైఁచి నన్ను నరకంబునఁ ద్రోయక వేంకటేశ్వరా! 29

చేయక జీవహింస యెటుఁ జెల్లును మానవ జీవయాత్రలో
నాయది భౌతికంబునవు నాంతరికంబునవుం బ్రయత్నముం
బాయము గాని మాకు నలవాటున నప్పొరపాట్లు గావుటం
జేయక కోప మర్భకులఁ జేఁదుము మమ్ముల వేంకటేశ్వరా! 30

నీదు నిషేవణంబు ననునిత్యముఁ జేసి హరిప్రియా దళం
బౌదలఁ దాల్చుచుంటి, త్వదఘౌఘవిఘాత మహార్ఘపాదపు
ణ్యోదక పానముం జేలుపుచుంటి! మదీయ పునః పునర్భవా
వేదన నోసరించుమ! నివృత్తి నొసంగుమ వేంకటేశ్వరా! 31

పేరయ శ్రీనివాసుఁడని! పెద్దమచెల్లి మగండు! గేహముం
దీరుగ రోజునద్వగ విధేయుల భక్తుల హుండికాన్కలా
ధారము! నామసార్థకతఁ దప్పెడి మానవజాతి మాడ్కి నీ
బీరము పేరులోనె కల విశ్వవిధాతవౌ వేంకటేశ్వరా! 32

పేరును వేంకటేశుఁడని పెట్టుక పెల్లుగ ఖ్యాతినొందగా
నూరక యుత్తిపున్నెమున కొప్పునొ! నామగతార్థతత్వసా
కారము భక్తకోటి కెఱుకంబడఁ బ్రాక్తన ప్రస్తుతాఘసం
హారవిధానపాలన రయంబునఁ జేయవౌ వేంకటేశ్వరా! 33

పాలను శేషశాయివయి పైఁడినెలంతుక కాళ్ళు పట్టగాఁ
బాలునఁ జేరి వేలుపులు ప్రస్తుతిఁ బల్కెడివేళ నాకటం
గాలక పోయెనీ కడుపు! కాలము మారగఁ బుట్టలోఁ బడం
బాలకు నావు గావలసి వచ్చెఁ గదా! విధి! వేంకటేశ్వరా! 34

గునపము వైచి గద్దువను గొట్ట నొకండడది భక్తిపూర్వక
మ్మనుచేనుఁ బచ్చే కప్పురము నద్దుక నిత్యము డాఁగు దాచేకొం
చే నవుమొగంబుతోడ నిలుచేందువు! సైఁచేమ మా దురాగతా
లనటుల! భక్తసంశ్రయ పరాత్పర! తిర్పతి వేంకటేశ్వరా! 35
(గద్దువ = చుబుకము)

కుమ్మరొకండు మట్టిఁ గొని కూర్చిన యా తులసీదళమ్ముతో
నిమ్ముగ నీపదార్చనము నెంతయు భక్తిఁ బ్రపత్తిఁ జేయగా
సమ్మతిఁ బ్రీతిఁ జెందితివి! చౌర్యధనమ్మును నిన్నుఁ గాన్కగా
కొమ్మను హీనులెట్లు సమకొందురు నీదయ వేంకటేశ్వరా! 36

కామము పీడలన్నిటికిఁ గారణ భూత మనైహికమ్మనౌ
నీమము నొప్పకామము పునీతము! సద్గతికి న్పథమ్మ! మ
త్కామము తావకీనపద గమ్యము! దుర్లభమైన త్వత్పరం
ధామము! చేవుపుట్టుల వినాశము! మోక్షము! వేంకటేశ్వరా! 37

ఆలి యొకర్తె వీడి చేన నల్గి, వికుంఠము నందు నొంటరై
యాలన పాలనాదులకు నాలిని రెండవదాని నొల్లుచేన్
నేలకుఁ జెంతఁ జేరి గిరినెక్కొని సొమ్ముల దండుకొంచే మ
మ్మేలగ వచ్చినాఁడవన నెవ్విధి నమ్మను వేంకటేశ్వరా! 38

పూనెను భక్తి నీపయి! విమోహ మదెన్నఁడు గ్రమ్మెఁ! ద్వత్పదా
ధీనుడ నెప్పుడైతినొ! మదిం బొడగాంచితిఁ బిన్ననాఁడె నా
దీనత నుద్ధరించే సరిదేవరవంచేఁ! ద్వదంఘ్రిసత్సమీ
చీన మనుగ్రహించి ననుఁ జేకొన రావొకొ వేంకటేశ్వరా! 39

వేణినిఁ బట్టి యీడ్చి కురువృద్ధ సభాంగణమందు బల్మినిన్
వీణము వీడ్చులాగ మొరవెట్టగ ద్రోవది, వల్వలిచ్చి య
క్షీణముగా ననుగ్రహము సేసిన కారణ మిద్ది యంచునో
పాణిని పాదసన్నిధిని వ్రాలగఁ జూపెదు వేంకటేశ్వరా! 40

కాటుక కన్ను లంగుళులఁ గందువ మట్టెలు బారు జేట్టునుం
జెన్నుగ శుక్రవార మభిషేకపు భోగమివెల్లఁ జూడఁగా
నన్నుగఁ దోచేమూర్తి యది! హా! యమృతంబును బంచే వంచనం
బన్నిన మోహినీ రుచిర భామిని రూపది వేంకటేశ్వరా! 41

చెడ్డదొ మంచిదో కొలువు సేయఁ దొడంగితి బత్తినెంతయున్
బొడ్డునఁ దమ్మిపుట్టువను బూనిన కొండల రాయడా నినున్!
దొడ్డెడ వాడవన్న బిరుదుం గొనఁ జెల్లగ నాదు కొమ్ము, నీ
లడ్డువు సాదమట్లు మధురంబన నీయెద! వేంకటేశ్వరా! 42

గడ్డవు మాకు నైహికసుఖప్రద నౌకనునెక్కి సాగగా
నొడ్డగు నీపదాశ్రయమునొంటగ, దాటగ నీ భవాబ్ధినిం
దెడ్డు మహత్వపూర్ణ భవదీయ పునీత వరిష్ఠ నామమే!
బిడ్డల తెన్ను మమ్ము నడిపించుత చేకొని వేంకటేశ్వరా! 43

వేయవు కాళ్ళు వే తలలు వేయవు కన్నుల విశ్వరూప మీ
వే యయి యెల్లెడన్ నెఱసి యీ జగతీ జను లాచరించు న
న్యాయ మధర్మవర్తనము లైహిక భోగవిలాస లాలసం
గాయుచు నుంటివో కొనుచుఁ గానుక లీయఁగ వేంకటేశ్వరా! 44

వయసుడుగున్! మనోవికృతిఁ బాయరు, ప్రాణము లైదు తక్కు వే
ళయును పరావిచారముఁ దలంపునఁ దాల్చరు, పైఁబడన్ జరా
మయదురవస్థ మృత్యుభయమానస విహ్వలు లౌదు, రయ్యెడం
బయిఁబడి వెక్కఁ బాదములఁ బట్టునె సద్గతి వేంకటేశ్వరా! 45

నా దురదృష్టమేమొ చిననాఁటను నెక్కొనలేదు భక్తి ప్ర
హ్లాదుని మాడ్కి నీపయిని! నర్జుననిన్నబలె యౌవనంబునం
బాదుకొనంగ లేదు! ముది వట్టున భీష్ముని భాతి చేయఁగా
నీదు సహస్రనామ నుతి నేరకఁ బోయితి వేంకటేశ్వరా! 46

తల గొరిగించుకొంద్రు తమ తామస వృత్తిని వీడఁబోరు! నీ
కొలువుకుఁ బాదచారులయి కొండ నుపానహము ల్దొఱంగుచుం
బలుమరు నెక్కివత్తురతి భక్తిఁ! దృజింప రొకించు కేషణల్!
దలపునఁ బారమార్థికతఁ దాల్చరొకింతయు వేంకటేశ్వరా! 47

నీవును నీసహోదరియు నీలశరీరులు గాఁగ హేతువే
దో వయినంబెఱింగితి! జనౌఘమహోఘ కలంకమున్ దయా
భావ సుహృన్మతిం గొనుచు భక్తుల సద్గతి నిచ్చి కావగాఁ
దావక మూర్తులా నలుపుఁ దాల్చె ననందగు వేంకటేశ్వరా! 48

మాయలఁ బన్ని మమ్ముల నమాయక జీవులఁ దోలుబొమ్మలం,
జేయుచు నాట్యమాడగను జీవన నాటక రంగ మందు నీ
కే యనువైన పద్ధతిని, నేవియొ నేరము లంటఁగట్టుచున్
న్యాయమ శిక్ష వేయఁగ నియంత్రణ నీదయి వేంకటేశ్వరా! 49

బోయఁడొకండు నావనిడి పోవఁగఁ జొప్పడె గంగ దాఁటఁగా!
బోయ లిఖించె నీకథ నపూర్వముగా మహి నిన్నుఁ జాటఁగా!
బోయత తీపిపండ్లఁ దినఁబుచ్చె నకల్మష భక్తి మీటఁగా!
ఆ యటవీ వివేకులను నొదలఁ దెల్పెద వేంకటేశ్వరా! 50

శరణము నీవయం దెలుప స్నాననిరంబర గోపకన్యకాం
బరముల దోఁచి మేని యభిమానము నూడఁగఁ జేసినావు, నిన్
శరణన నేకవస్త్రకిడి చైలము లెన్నియొ గుట్టుఁ గాఁచినా
వరసితి నీదు పాదశరణాగతి తత్వము వేంకటేశ్వరా! 51

ముండన ముండమండిత ప్రబుద్ధు లెదం దలపోయ నొప్పునే
నిండిన పాపభాండములు నీకొక గుప్పెడు జుత్తు నిచ్చుచో
నెందుక పోవునంచు ! మొలకెత్తెడు నూత్న కచాళిభంగి నా
గుండునఁ, బాపసంచయముఁ గూడదె క్రొత్తగ వేంకటేశ్వరా! 52

పిల్లలు పుట్టలేదనుచు వేదనఁ జెందగనేల వెట్టియై
పిల్లలుఁ బెండ్లిలేమిఁ గురు భీష్ముఁడు పొందడె పుణ్యలోకముం
బిల్లలు నూర్వురయ్యుఁ బితృ పిండము వెట్టిరె ధార్తరాష్ట్రులుం
జెల్లని నీదుచూపుఁ బడ సద్గతిఁ గూడరొ వేంకటేశ్వరా! 53

నాలుక నుంచేఁగా నదుపనాదర భాషణఁ జేయకుండగా
మేలగు లౌకికమ్మునఁ జెమీ! మది సంతత పారలౌకికా
లోలితమై చరింపఁ గుదురున్ భవచింతన! లక్ష్యమీవయై
నాలు కెడందలన్నిలిపెనా పడు ముక్తిని వేంకటేశ్వరా! 54

ఎఱుఁగుదు నేను దాశరథి నింతకు మించి యెఱుంగనంచు దాఁ
పఱిక మొనర్చితీవు భగవంతుని తత్త్వము స్వీయమాయలో!
నెఱుఁగుదు నేన బ్రహ్మమని యెన్నియొ మాయలఁ జూపి యాదవుల్
దఱుగఁగ మిన్నకుంటివటు దాటక నీదవు మాయ నీవునున్!
మఱి కడతెంచే మానవుల మాకెటు సాధ్యము మాయ వార్ధినిన్?
నెఱపఁగ ముక్తిమార్గమును నీవె సదా గతి వేంకటేశ్వరా! 55

శ్రీ నొకదాని బావ గళసీమకుఁ గట్టి బిగించి మంగళ
శ్రీని స్వయంబుఁ జేకొని నిలింపులకున్ సుధఁ బంచి నీవభి
ఖ్యానముఁ గొంటి వప్పనముగాఁ! దన తాళిని మాటిమాటికిం
దా నిరుసేతులం దడిమి త్వత్స్వస యాశివ భర్త భద్రమున్
లోనఁ దలంచుచుండుఁ! దగునో యటుఁ బాల్పడ వేంకటేశ్వరా! 56

నల్లనివస్తు వెల్లకిరణమ్ముల సంగ్రహ శక్తిమంతమం
చెల్లరు శాస్త్రవేత్తలు వచింతురు! వ్యోమమునన్ రహస్యమౌ
నల్లని గహ్వరంబులు వినాశకరంబులు వెక్కు లీవునున్
నల్లనివాఁడవే! తివిచి నాజననాంతర కర్మశేషమున్
జెల్లగఁ జేసి మద్భవముఁ, జేకొన రావయ వేంకటేశ్వరా! 57

ఏనుఁగు పిల్చిపిల్వ దవుడెత్తుచు వచ్చి స్వయంబుఁ గాచినా
వేనుఁగు పాటికార నరు లెంతగ వేడిన రానెరావు! నీ
కేనుఁగు చుట్టమౌనుగద యేనుఁగుమోమయ మేనయల్లుడౌఁ
గాన! స్వబంధురక్తి యది కాదనుకొందున వేంకటేశ్వరా! 58

కట్టడిసేయ రోటికిని఼ గట్టగ నిన్ను యశోదకయ్యె! నా఼
కట్టుకొనంగ సత్యకును గల్పక బంధితు఼ జేయ నయ్యె఼గా!
కట్టున఼ బట్టనెంచి నిను఼ గౌరవ యూధము భంగమందె఼గా!
కట్టు఼బడంగ సమ్మతిని఼ గాక లభింతువ వేంకటేశ్వరా! 59

పుత్రులు పుట్టకేడ్చె మును బుట్టియు నేడ్చెనయోధ్య రాజటుల్
పుత్రులు పుట్టకేడ్చె఼ గురుభూపతి భార్యయు఼ బుట్టి యేడ్చె఼గా!
చిత్ర ఋణానుబంధములు చేతము నెంచిన వేవికావు! మా
పాత్ర నిమిత్తమాత్రము! ప్రబంధము నీదయ! వేంకటేశ్వరా! 60

పేరులు వెక్కులున్నయవి పెద్దవి చిన్నవి పల్క఼ గష్టమై,
కూరిమి఼ బల్కవీలునయి, కొన్ని గుణాత్మకమౌచు఼, గొన్ని యా
కారపు సూచనాత్మకము గానయి! కాని త్వదీయనామ మే
పారును సార్థకంబగుచు బాపవినాశక! వేంకటేశ్వరా! 61

మందర భార మట్లు నినుమాదిరి మోయ఼గ సాధ్యమేరికొన్
మంథర కుబ్జబర్వు నటుమాదిరి రామునివై వహించితే!
కంధర వైజయంతిక! యఖండభవాండ ధురాధరా! యస
ద్బంధనముక్తి నాకిడను భారము నోపుమ వేంకటేశ్వరా! 62

పగలును రాత్రి నీవ యయి భాసిలు దేవర సుప్రభాతమే
ల? గురుసురాపగోద్భవపదా! భృగువార మహాభిషేకని
ర్మలపరికర్మమేల! కుసుమాలు పసిండి విభూషణాలు శ్రీ
కిలకును స్వామికేల మురిపించేగ! నొ఼గద వేంకటేశ్వరా! 63

గురువుకుఁ బంగనామములఁ గూర్చెడు ధూర్తులు నేటి చేట్టులున్!
గురువున దైవభావమును గూర్చుచే స్ఫీతవినమ్రతన్ జగ
ద్గురువయి నీవ యొక్క గురుఁ గొల్చితి భక్త్యుపచార సద్విధిన్!
గురువు నెఱుంగ బ్రహ్మముగఁ గూరుగ జ్ఞానము వేంకటేశ్వరా! 64

బాలుని హ్లాదునిన్ బరమభాగవతోత్తముఁ జేసి కాచితే!
బాలుని నా ధ్రువున్ గృపను భాసుర నిశ్చల తారఁ జేసితే!
బాలుని నన్ను నా పొలుపుఁ బాపవిదూరు నొనర్చి కాళ్ళ నీ
మ్రోలఁ బడుండఁ బాత్రునిఁ బ్రబుద్ధునిఁ జేయుమ వేంకటేశ్వరా! 65

పుష్కరనేత్ర! నీదృశలమోఘదయామృత పాపనాశముల్!
దుష్కర జీవయానమున దూషిత కార్యములెన్నొ చేసితిన్
ముష్కరవర్గషట్కరిపు ప్రోద్బల చిత్తవశుండనై! దయా
విష్కృతిఁ బాపనిష్కృతిని వేడుదు నీయగ వేంకటేశ్వరా! 66

చింతలు పెక్కువైనములు! చేసిన యార్జన భద్రపర్చునా
చింతయు! లేనిదానిఁ దన చేతను జిక్కగఁ జేయఁబూన నా
వంతయుఁ! బీనుగైన తఱిఁ బాడెను గట్టగ వెంటనేమి రా
దింతలు సేసి! తద్విషయ మెంచేరె సుంతయు వేంకటేశ్వరా! 67

వచనము లాలకింతురు సభక్తిఁ బఠింత్రు పురాణ సంహితల్
రచనలు వేదభాష్యముల వ్రాతల నన్నిటి నాకళింతురే
శుచి పచిఁ బూని నైష్ఠికులు శ్రోత్రియు లయ్యును సిద్ధియున్నె త్వ
ద్రుచికర నామకీర్తనవిలుప్త రసాలకు వేంకటేశ్వరా! 68

చేసితినేమొ నేను మును చేయఁగఁ గూడని కృత్యముల్! పురా
ధ్యాస యయుక్త మిప్పుడు నయంబున నీ వరివస్యలన్ సదా
భ్యాసము సేయుచుంటిఁగద! ఆదట మత్కృత పాపనాశముం
జేసి సమంజసంబుగఁ బ్రసిద్ధి గడించుమ వేంకటేశ్వరా! 69

కుక్కను వెంటఁ దోడుకొని గోముగ లాగుచు నీడ్చుచున్ స్వయం
బక్కఱఁ దీర్చుచుందు రుదయంపుఁ బచారులఁ జేయు నీ జనుల్
కుక్కయ జీవుఁడా గొలుసు కూడిన కర్మము నా కయే విధిన్!
నిక్కమెఱుంగ నీ ప్రజకు నేర్పగ రాదొకొ వేంకటేశ్వరా! 70

కొండను నెత్తిపట్టితివి కొండలనెక్కి నివాసముంటి వీ
ఖండిని నుద్ధరించితివి కంధివిగాహము నుండి యెల్ల భూ
మండల మొక్కపాదమున మైకొని కప్పితి వేమి లీలయా!
దండము కృష్ణ! సూకర! త్రిధామ! త్రివిక్రమ! వేంకటేశ్వరా! 71

ఎందును జెప్పగాఁ గనమిదే శ్రుతులం గనరాదు నాల్గిఁటన్!
చేఁందము దీనినారయ ప్రశస్తము విష్ణుని నామసర్వమున్!
విందగు వీనులన్ వినినఁ! బేర్మి స్మరించిన మోక్షమిచ్చు "గో
వింద" పదమ్ము దీనిసరి వేఱొకటున్నదె వేంకటేశ్వరా! 72

శివహృదయాంతరస్థుఁడవు శ్రీహరి! శ్రీహరి చిత్తమందునన్
శివుఁడు గలండు నిక్కమని చెప్పుదు రెల్లరు విజ్ఞులీ రహ
స్యవిషయమున్ వివేకమతి ధ్యానము సేయగ సత్యమొక్కటం
చేవగతమౌను "తత్త్వమసి" యందున భావము వేంకటేశ్వరా! 73

ధనమును బోసి సుంతయును దానిఁ గ్రయంబు నొనర్పలేరు! తాఁ
బెనఁగొని యాక్రమించేగను వీలును గాదధికార ధాటికిన్!
అనువుగ దానధారఁగొన నయ్యది యెవ్వని యాస్తి! భక్తి నె
క్కొనకయ త్వత్పదస్థలము గోరినఁ దక్కునె! వేంకటేశ్వరా! 74

చిఱునవ్వుఁ జోఁచి చేకొనెఁగ శ్రీ నిను! రాక్షస బృంద మేమఱెం
చిఱునవ్వుఁ జోఁచి నాడు సుధఁ జేకొన! మోహన మూర్తివైతి వా
చిఱునవు దోఁడ రామునిగఁ! జేరెనుగా యలమేలుమంగ నీ
చిఱునవ్వుఁ జోఁచి మైమఱచి చెంగట మోహన వేంకటేశ్వరా! 75

ముందటి పుట్టువ ల్దెలియఁ! బూర్వ జనుస్సుల లెక్కయంచేనా
కందదు! త్వత్సనాతన వయఃపరిమాణము నాది కూడ య
న్కొందును నేను జీవుఁడను! కూడగ నిన్ను దపించేచేంటి! ని
న్నొందగ నెంత వేచెదఁ బ్రభూ! ననుఁ గొమ్మిక వేంకటేశ్వరా! 76

అని నరివీరు లేసిన మహాస్త్రశరాగ్నినిదాఘశక్తి పా
ర్థుని దహియింపకుండ యనిరుద్ధుడ! కాచితి నందిఘోషమున్!
వనజదళాయతాక్ష! సుకృపాసుధ వే కురియించి నాదు ప్రా
క్తన భవసంచితాఘఘనఘాసిని నార్పవొ వేంకటేశ్వరా! 77

గోకులవాసు లిండ్లఁ బెరుగుం బులిపాలను వెన్నజేన్నులం
దా కుడువన్, బ్రసాదముగఁ దక్కినదాని విడన్, గ్రహింపకా
వ్యాకుల గోపకాంతలు రహస్యముఁ, గృష్ణుని నింద సేసిరే!
ఆకలిదప్పులుండున భవాండపుఁ బొట్టకు! వేంకటేశ్వరా! 78

(పులి పాలు = (నిల్వ) దాచి యుంచిన పాలు. "పొంచి పులిపాలుఁ బెరుగులు"... అన్నమయ్య కీర్తన)

కోతుల వేనవేల సమకూరిచి రావణ రాణువంత సం
పాత మొనర్చి తీవనుచుఁ బల్కఁ బ్రగల్భము లేల ప్రౌఢి! మ
చ్చేతమదొక్క మర్కటము! తెల్పుమ దాని నియంత్రణంబు! నే
రీతిని నాకొడంబడుఁ! బ్రవృత్తి స్థిరంబవు వేంకటేశ్వరా! 79

ఆ దరహాస చంద్రికల నాకనులం దెలితమ్మి రేకులన్
మేదిని శ్రీలు నీ ప్రియసమీక్షను జొక్కుచు వ్రీళనొంద నా
పాదశిరోవిభూషణసువర్ణధగద్ధగ లక్షిపర్వమౌ
నీదరి చూడ్కినాకమరు నిర్వృతిఁ గూర్పవె వేంకటేశ్వరా! 80

దినదినమేను జొతు నిను దేవళమందునఁ బద్మ పీఠమం
దు నిలిచి పట్టు మీపద మనుగ్రహ మందుము పుష్కలంబునో
యన వలచేతఁ జూపుచు రహస్యముఁ, గాని త్వదీయమోహనా
స్యనలినదర్శనంబు మయి సంస్మృతి నిల్పునె! వేంకటేశ్వరా! 81

భక్తుఁడు పుండరీకుఁడిదె వత్తునొకించుక వేచినిల్మనన్
యుక్తిని రాతిబొమ్మయి వినోదము సేయగ హేతువేమి! వై
యక్తిక కార్యమేమి వడె నచ్చట నిల్వక పార! నీకు నీ
భక్తుల నోముటే కద యవశ్యపుకార్యము వేంకటేశ్వరా! 82

అరి దశకంఠుఁ ద్రుంచే నని నద్భుతవిక్రమ శౌర్య దార్ఢ్యముల్
విరివిగఁ గల్గినట్టి కపివీరుల నెల్లులఁ దోడుఁ గోరితే!
నరులను బిల్వకుంటివి రణంబునఁ దోడ్పడు గొల్చునీయఁగా!
నరులఁ గొఱంతయేమది వినాయొక వాలము వేంకటేశ్వరా! 83

తామరపాకు పైఁబడిన దారద బిందువు నిల్వకున్నటుల్
నామదినిం ద్వదీయ చరణంబుల నిల్వక యుండె భక్తియున్
కౌముదిలేని యామినుల కైవడి నీపయిఁ జింత లేక యో
స్వామి మదీయజీవనము! స్వాంతముఁ జేరవె వేంకటేశ్వరా! 84
(దారదము = పాదరసము)

దొరలెను బాదఘాతమున దుందుభి దేహము యోజనాల్పదిన్!
వరలెను రామపాలనముఁ బాదుక లేల నయోధ్య! వాసిఁ దా
నెరిగిన యాంజనేయుఁడు మరే యితరస్థితిఁ ద్రోసి రామ స
చ్చరణము సంశ్రయించెఁగ ప్రశస్తపదంబని వేంకటేశ్వరా! 85

శ్రీకర! మాధవా! కలిఁ బ్రసిద్ధము వేంకటనాయకాఖ్య! య
స్తోకము నీదు నామమటు దోసముఁ బాపును కాసులిచ్చినన్!
లేక త్వదంశ మీ ధరణిభృత్తుగఁ గాదను సంస్కృతోక్తికిన్★
మా కగు పాలకుల్ నిజము మచ్చులు నిన్నలె వేంకటేశ్వరా! 86
(★ నా విష్ణుః పృథివీ పతిః)

నమ్మని సంశయాత్ములను నమ్మిన త్వత్పద సంశ్రయాత్ములన్
సమ్మతి నాదరింతువు బ్రసన్నత నెంచేక తారతమ్యతన్
నమ్మికఁ బూని కొల్చితిని నైజమెఱుంగని వాఁడవో మదీ
యమ్ము! త్వదీయ నైజ సుదయాదృశి నించేమ వేంకటేశ్వరా! 87

అసురులకున్ వరంబులిడి యాదరబాదర, పైన నుస్సురం
చేసువుల నూడ్చ వారివి బృహత్తర యత్నము సేసి తాల్చఁగా
వసుధ దశావతారముల వంటివి, వాటికిఁ దిండి తిప్పలన్
వసతినిఁ గూర్చ మా పనియ! బాగు మహాశయ! వేంకటేశ్వరా! 88

మోహము నొందఁగాదె కురుభూపతి పుత్రుల యుద్ధమేర్పడెన్!
మోహము నొందఁగాదె సుధముట్టక పోయె దితిప్రజాతులున్!
మోహము నొందకున్నఁ జేనిపోయెడి వాఁడొకొ భస్మఁ డౌనుబో
మోహము సూవె నీచరణముల్గొన నాకును వేంకటేశ్వరా! 89

ప్రాపిత దివ్యదృష్టి ధృతరాష్ట్రుఁడు గాంచెను ద్వన్నిజాకృతిన్
ఆ పృథపుత్రుఁడుం గనియె నావిదురుండు యశోద భీష్ముఁడున్!
బ్రాపణమయ్యె నెందఱకు భావమున న్నిజ తత్త్వ దర్శనం
బాపయి! గాంగుఁడున్ విదురులందుటఁ దక్కను వేంకటేశ్వరా! 90

యాచకుఁ డస్వతంత్రు డొలయం బడయం దన యిష్ట, మయ్యు సం
కోచము వీడి వేడెదను గూర్పఁ ద్వదీయసమర్థతానుకూ
ల్యోచితమౌ వరంబొకటి! యుష్మదధిశ్రయ పాత్రతాసమా
లోచన సేయకిమ్మమృత రూపము వైళమె వేంకటేశ్వరా! 91

శ్రుతులను సూనుకిచ్చితివి సోమకుఁ జంపి ఝషంబవౌచుఁ, బ
ర్వతమును మోసి త్రచ్చఁగను బాలసముద్రము కూర్మమైతి దే
వతలమృతంబుఁ గ్రోల! వెలిపందిగ భూసతి నెత్తి నుద్ధరిం
చితి! వివి యెల్ల మాకొఱకుఁ జేసిన వౌనొకొ? వేంకటేశ్వరా! 92

పొంచి వధించి స్వర్ణకశిపున్ నరకేశిగ ద్వారి నోమితే!
దించితె క్రిందకున్ బలినిఁ దేర్చ నజాండుఁ ద్రివిక్రముండవై
త్రుంచితె యయ్య చేవుసరి దుర్మదరాట్టులఁ బర్శుపాణివై!
యించుక యేమొనర్చితివొ యిందును మాకయి వేంకటేశ్వరా! 93

రాముఁడవై దశాస్యుని నిలాసుత కోసము మట్టుపెట్టితే!
భూమి యలంగఁ బాపభరమున్ రణమూన్చితి బార్థసాదివై!
క్షేమముఁ గూర్ప వేల్పులకుఁ జేసితి వా త్రిపురాసురాంగనల్
దాము పతివ్రతాత్వవరధర్మముఁ గోల్పడ బుద్ధరూపివై!
ఏ మొఱగంబడెన్ నరులకిందును శ్రేయము? వేంకటేశ్వరా! 94
(సాది = సారథి)

కలియుగ మందుఁ దుష్టతుదఁ గల్క్యవతారము దాల్చి వత్తువం
చిలకుఁ బురాణ సాక్ష్యమగుపించె నదెన్నడు కల్గఁబోవునో!
నిలిచితె యిప్పుడిట్లు ధరణిన్మహిమాన్విత రూపమంది కే
వలము నృజాతి యుద్ధరణ బాధ్యతఁ గైకొని! వేంకటేశ్వరా! 95

మేదిని పేశలాంగి సతి! మీఁదుకుఁ గోఱలనెత్తఁ గ్రోడివై
యాదట నుద్ధరింపగ జలాంబుధినిన్ బెకలించె వేళ మేన్
మీద క్షతంబులౌననెడి మేధయె మృగ్యమొ! చేతులుండె వేల్
గాదొకొ! దంష్ట్రల న్పయిడికంటినిఁ దేర్చిన వేంకటేశ్వరా! 96

తెచ్చిన కల్పకమ్మిలకుఁ దిర్గిస్వరాట్టునకేల పంపితో!
తెచ్చినదాని విత్తయినఁ దీయక పోతివి! నీదు తిర్మలన్
మచ్చెన కొక్కటున్న యది మాకుఁ ద్వదీయప్రసాదమున్ ధనం
బిచ్చి క్రయంబు సేయక లభింపగఁ జేసెదు వేంకటేశ్వరా! 97

ఆశయె యింధనమ్ము భవయానపు నావకు! వర్గషట్కవా
రాశి తరంగసంక్షుభిత ప్రాణుల మైహిక మోహభావనా
వేశిత మోఘజీవులము వెన్కటి ముందటి పుట్టుచేట్టులున్
నాశము గాఁ ద్వమేవశరణం శరణంబవు వేంకటేశ్వరా! 98

ఊరన నీ గుడున్నదియ యూరగు, నీ కభిషేక వారినిం
బాఱెడు నేఱె యేఱగు! భవచ్ఛుభ మూర్తి నలంకరించే పు
వ్వారుల నిచ్చే పాదపమె పాదపమౌను త్వదర్చ సేయ లో
నారటమందు మానిసియె యౌఁగద మానిసి వేంకటేశ్వరా! 99

ఊఁదగఁ జిల్లుబొంగునను నూపిరు లయ్యవి వేణురావమై
మేదిని గొప్పపేర్వడసె! మిత్తిక చిల్లుల బొంది నూర్పు లై
దూఁదగ నయ్యె జీవరవ మున్కియుఁ బ్రోదియు నీవ మాకు నీ
పాదపు టెల్లినీడ కద ప్రాపును గాపును వేంకటేశ్వరా! 100

అంతటి దైవతంబవిల నగ్గిరిసప్తకమందుఁ జేరి మా
చింతల వంతలన్మడఁచే శ్రీసతి భూసతి తోడ నిల్వ మా
కింతకు మించి కోరఁదగునిచ్ఛ మరేమవు! నాదుకొమ్ము దా
వంతము నొచ్చేనత్తరి రవంత దయంగని వేంకటేశ్వరా! 101

చేర వికుంఠధామ మఱచేతిని నామలకమ్ము నీదు పూ
జారిపదమ్ము! పూర్వతన జన్మపరిక్రమ పుణ్య సంపదా
కారము! వేల్పులైన నవకాశముఁ గోరుచే నారటింతు రే
మేరకునైన! మర్త్యులము మేమిఁక భిన్నమొ? వేంకటేశ్వరా! 102

పావన ఫాలపుండ్రములు పైగతి యోచన చేసికొమ్మనున్!
నీ వలచేయి సద్గతికి నిశ్చిత మార్గముఁ జూపి కొమ్మనున్!
నీ వర మోహనస్మిత మనిత్యము దేహము మాయ సుమ్మనున్!
దేవర! మోహితుల్ ద్వదుపదేశముఁ గొందురె వేంకటేశ్వరా! 103

మూడవ కన్నులేమి సరిపూడ్చఁగ మౌళినిఁ బింఛధారి వై
నాడవొ మూడుకన్నులయ నాఁబరఁగన్! వసుదేవసూను! య
వ్వాడి త్రిశూలమేది తొలి వాసియ తప్ప, యభిన్నమంచు మీ
జోడు నెఱుంగుదున్ మదిని సూనృత మర్మము వేంకటేశ్వరా! 104

నీరము దూపఁ దీర్చు ధరణిం, బసికూనల క్షుత్తుఁ దీర్చుఁగా
క్షీరము, నారికేళ జలసేవన మిచ్చును దేహశైత్యమున్,
నారము లివ్వి తీర్చుఁ గరణంబుల బాధలు! సంచితాఘసం
భారముఁ దీర్చుఁ ద్వద్విమల పాదసుధాంబువు వేంకటేశ్వరా! 105
(దూప = దాహము)

తా బలశాలినంచొకఁడుఁ, దాను ధనాఢ్యుఁడనంచొకండుఁ, దా
నే బహు శాస్త్రవేదపటు విమ్మహినంచు నొకండు, మేటి తా
నే బహువైద్యవేత్తనను హెచ్చులు వోవునొకండుఁ, గాని తా
నే బలిమిన్గణించేదుగ మృత్యువు ద్రెక్కొన వేంకటేశ్వరా! 106

ఏచిన బాణమీవ యయి యీశ్వరునే త్రిపురాంతకుండనన్
గాచెచు క్షేత్రపాలకునిగాఁ బడియుండ శివాలయమ్ములన్
నోచెడి వారె లేరుగ నినుంగని! శ్యాలక బాంధవమ్ము ని
న్నీ చేదురెంత బాధ్యత వహించేగఁ ద్రోచెనొ వేంకటేశ్వరా! 107

పరిమళ మిచ్చితీవు మరువమ్మున కాకుల! గింజనేలకిన్!
విరులకు జాజిమల్లియల! వేళ్ళ కుశీరముఁ! గట్టెయందు నా
సరణిఁ బటీరమందు! నరజాతి మనంబున నేల భక్తియన్
బరిమళ మద్దకుంటివటు బద్ధక మందితె వేంకటేశ్వరా! 108

చేయఁగరాని దౌష్ట్యములఁ జేసి విషణ్ణభయార్త రోగ బా
ధాయుత దుస్థితిం బడసి యంత్యపరిస్థితి దగ్గరించే 'నా
రాయణ' శబ్దమాత్రమున కైనను నాలుక నుచ్చరింప శ్వ
శ్రేయస మా యజామిళువలెం దొడరుంగద వేంకటేశ్వరా! 109

సారము ప్రాతపల్కుల, విచారపదార్థము సర్వశాస్త్రకూ
పార గవేషణన్, మెలకువం దెలియంగల వస్తు సమ్యగా
కారము, యోగిహృత్స్మరణ గమ్యము, నిత్యము, మోక్షసంప్రదా
కార పరాస్వరూపమవు, కైనిడి కావవె వేంకటేశ్వరా! 110

మానుగ నుప్పుఁ బోసి బహుమాత్రము మట్టునఁ బెంచినట్టి తే
మ్రానున బొండపున్ జలము మాధురిఁ గోల్పడునే! నయంబునన్
దేనియఁ బోసి పెంచేఁ దన తిక్తత వీడునె కారవేల్లమున్!
మానుప సాధ్యమే జనుల నైజగుణంబుల వేంకటేశ్వరా! 111

ఇక్షురసమ్ము గుండిగల నెత్తుచుఁ బోసిన వేముపాదునన్
లక్షణమైన చేదుచేవి రవ్వయు మాయదు గాని పుండరీ
కాక్ష! త్వదీయ పాదకమలార్చిత తీర్థరసమ్ముఁ గ్రోలఁ బా
పక్షయమౌట తథ్య మధిపాతకి కైనను వేంకటేశ్వరా! 112

నల్లనిమబ్బు వర్షకరణంబగుఁ, దెల్లని మబ్బు తొల్కునే!
నల్లని కంటిపాప వలనంగద చూడ్కులు, వెల్లబాఱినం
జెల్లునె! నల్లనౌ కతముచేఁ గడకంట కృపా సువృష్టినిం
జేల్లగ నీకు ధర్మమవు సాంద్రదయాకర! వేంకటేశ్వరా! 113

కోపము వచ్చెనేని శరగోపము మాడునఁ గొట్టి చెప్పు! నేఁ
బాపినటంచు నీమది ముభావము గల్గినఁ గాల్చు మారతిం!
దేపకుఁ దేపకున్నదత దిద్దుటసహ్యము! ముంచేరాదె నన్
నీ పదతీర్థ మందు! కద నీవ సదాగతి వేంకటేశ్వరా! 114

కాళ్ళను గన్నులన్ని సరిగా పనిసేసిన వేళ నెన్నియో
యూళ్ళఁ బరిక్రమించితి ననుత్తమ లౌకికకార్యవర్తినై!
వెళ్ళక యుంటి నీగుడుల వేడుకనైన! వయస్సుమీఱగా
కీళ్ళెదిరించేఁ గోరఁ గృతకృత్యుడనౌటెటు వేంకటేశ్వరా! 115

మూరెడు జానెడౌ యడవి మొద్దుమెకమ్ముల పుణ్యమేమొ! క
స్తూరికురంగనాభిజము తోయజనాభు లలాటనామమై
సౌరుగఁ జేరు! నీలిమెయి జేను నిగన్నిగలాడ లోమమా
ర్జారము తైలమిచ్చు! నరజంతువు వ్యర్థము వేంకటేశ్వరా! 116

వార్చరు సంధ్యఁ! జేయరుగ బ్రహ్మనుపాసన శౌచదూరులై!
నేర్చుట దేవభాష నిఱునీఁగెఁ! బఠింపరు వేదశాస్త్రముల్!
మార్చిరి వేషభాషలును! మానితవర్తన నాశిలెన్! దిగం
గార్చిరి వైదికమ్ము ద్విజకర్మల నీకలి వేంకటేశ్వరా! 117

తలలు పదున్నవాఁడు పెడదారులఁ బట్టగ బుద్ధి రూపఱెం!
దల యొకటున్నవాఁడు శరణంబని సన్మతి రాజ్యమేలె! వేల్
గులికుల కార్తవీర్యుని ప్రకోపము క్షత్రియ నష్టిఁ జేసెఁగా!
బలిమి వివేకమౌఁ దలలు బాహువు లౌనొకొ వేంకటేశ్వరా! 118

ఓర్పును దృష్టియుం గలిగి యుల్లమునం దనసూయతో సదా
కూర్పుఁగనౌను బ్రహ్మము నకుంఠిత వైఖరి నాత్మచారమున్!
కర్పటమై శరీరమిది కప్పెను జీవుని! స్వత్వమెల్ల బ్ర
హ్మార్పణ సేయ సిద్ధము గదా యమృతంబిక వేంకటేశ్వరా! 119

పుట్టువుఁ దల్లిదండ్రులను భూమిక లేని వ్యవస్థితుండ వా
పట్టునఁ గన్నగోముచెవి స్వాదనమొందు నపేక్ష తీరఁ, గాఁ
బట్టయి తల్లి నీకు, ప్రభవమ్మయినావుగ దేవకీ సతిం
బట్టిగఁ, గోసలాత్మజ కుమారుఁగ, స్వేచ్ఛను వేంకటేశ్వరా! 120

అల్లురు మామకొంపఁ బడి యల్లుక పోయి నెలల్నెలల్ దమం
జెల్లగఁ జేసికొంట యది జేజెలఁ జూచియ నేర్చిరో నరుల్!
ఇల్లరికంపు యోగమది యేర్పడె నీకుఁ గపాలికట్లు పు
ట్టిల్లొకటంచు లేక కద! యెంతటి దీనత! వేంకటేశ్వరా! 121

ఒకయెడఁ గొయ్యబారి నిలుచుండెద వింకొక తావు రాయిగాఁ
బ్రకటనమౌదు! వింకొక స్థలంబునఁ బింజర విగ్రహంబవై
సుకళల నీనుచుందు! వొకచో నునుమిత్తిక బొమ్మయౌచునున్!
సకలపదార్థ సంవసన! నారనిజాశ్రయ! వేంకటేశ్వరా! 122

ఉల్లము రంజిలంగఁ గనుచుందురు వెక్కు లపథ్య దృశ్యముల్
వెల్లకిలం బరుండి మెయి విశ్రమమందగ దూరదర్శినిం
బొల్లుగ! సుంత బోర్లపడి పొందిక నీకు నమస్కరించినం
బెల్లుగ నీకటాక్షము లభించి తరింపరొ వేంకటేశ్వరా! 123

కనకము నీది తస్కరుల కైవస మౌటను, శక్తి యున్నచోఁ
దనదగు సొత్తులీ గతినిఁ దక్కిడికారుల పాలు గాక కాఁ
పునిడి స్వకీయమౌ మహిమముం గనుపింపగఁ జేయరా డదే
మని తలపోతురీ తెలివి మాలిన మానిసు లీ వసుంధరే
శుని నిను గూర్చి, స్వర్ణమగుచో భ్రమఁ జెందుట లోహమన్న మ
న్నన కఱవౌట నిర్గుణమనస్కున కుండున వేంకటేశ్వరా! 124

ఎంచితి నేడుకొండలకు నేలిక నేడుగడంచు నిచ్చేలున్
సంచిత కిణ్వతాపిత విషణ్ణ విపన్న జనార్తినాశకున్
ప్రాంచదశీతహాయన కలాధర దృగ్యుగ హార్దసాంద్రు, బ్ర
హ్మాంచిత పూతపద్మపదయామలు నిన్ మది వేంకటేశ్వరా! 125

దర్భను నొక్కపోఁచేను బదార్థముపైఁ బడవేయ గ్రాససం
దర్భవశాన శాస్త్రవిహితంబుగ దోసము వోవునందు ర
ట్లర్భక మానవాఘ నివహగ్రసనోద్ధరణంబు కాదె త్వ
న్నిర్భర నామమొక్కటి కదించేగ నాల్కను వేంకటేశ్వరా! 126

పుణ్యము పట్టఁ బాపములఁ బూడ్చఁ గలిన్ సులువైన దొక్క నై
పుణ్యపథంబు నార్యులు ప్రబోధమొనర్చిరటుల్ సతమ్ము షా
డ్గుణ్యపరాస్వరూప! నినుఁ గూర్మినిఁ గీర్తన సేయుచుంటి! దా
క్షిణ్యసుధాకటాక్ష పరిషిక్తునిఁ జేయుమ వేంకటేశ్వరా! 127

కావ్యము లెన్నియేనియుఁ బ్రగల్భత నల్లగ నౌను వైదుషీ
భవ్యత తేజరిల్లఁ బ్రతిభాప్రభ లెంతయు మెచ్చఁ బండితుల్
దివ్యగుణాన్వితున్నిను స్తుతించుచు జేయక పద్యమొండసం
భావ్యము గాద తత్కవుల పాటవ మెల్లను వేంకటేశ్వరా! 128

చంచల సింధుకన్య తన స్వామి శుభాంఘ్రి బిసప్రసూనయు
గ్మాంచన మాత్మ భక్తిని నయంబున స్వీయకరంబులొగ్గి ని
గ్గించే స్థిరస్థితిం గొనియెఁ! గించన యేని మదీయ చేత మా
లించేదు చంచలాంతముఁ ద్యజింపఁ ద్వదర్చను వేంకటేశ్వరా! 129

పలుకగ మూఁడునామముల వాఁడవటంచు భజించు భక్తకో
ట్లెలమిని వేయినామముల యీశ్వరు నిన్వినఁ జోద్యమే కదా!
నలిగొని యేడునేడు భువనాలకు నాథుని నిన్ను నేడుకొం
డలకును సామి యంచుఁ బొగడన్ నవు రాదొకొ వేంకటేశ్వరా! 130

ఆకసతేని యల్లుఁడవు నాకస మామకు దాపు నుండునం
చాకత మౌనొ సప్తకుధరాగ్రమున న్నిడిమట్టుఁ బెట్టగా?
నేకముగా హిమాచలమె యెక్కక పోతివొ! నిన్నుఁ జేరఁగా
మాకది యెంత కష్టమయ మాటికి మాటికి వేంకటేశ్వరా! 131
(నిడిమట్టు=కుటుంబము)

విలయపయోధి నీట వటవృక్షపుటాకున నూగుచుండి, చి
ద్విలసన మందహాస ముఖదీప్తుల, నోటను బట్టి కాలియం
గులి, నలతమ్మిరూపు పసికూనగఁ జేతుల నట్టిటూపు కే
వల పరమాత్మ దర్శనముఁ బ్రాప్తము సేయవొ వేంకటేశ్వరా! 132

సజ్జన సాధుపుంగవుల సంశ్రయముంగొన నీచమానవుం
డుజ్జనసేసి దౌష్ట్యముల నున్నత గౌరవ మంద నోచుగా!
మజ్జరె! పూలఁ గీటకము మాన్యత నొందదె పూలతోడ నీ
యజ్జులఁ జేరి పూజలిడు నత్తరి తానును వేంకటేశ్వరా! 133
(అజ్జ = పాదము)

ఇమ్ముగ నక్రమార్జనము నెంతయు సంపదఁ గూడఁబెట్టి యా
సొమ్ములనే తృణంబు దయఁ జూడు మటంచేను గాన్కపాత్రలో
గమ్మున వేసి పోవుదురె కాని తలంపరు నీదు పూజకై
కుమ్మరి మంటితోఁ దులసిఁ గూర్చిన భక్తిని వేంకటేశ్వరా! 134

పూని సురావళిం బొలసి పోసిన నీ సుధఁ ద్రావి యయ్యె స్వ
ర్భానుఁడు రెండు ఖండముల వాఁడుగ! దర్భలఁ జీఁకఁగా సుధా
పానము సేయ నాగులకుఁ బాయలుగా రస చీలె రెండుగా
నేనుఁ ద్వదీయనామ సుధ నిమ్ముగఁ గ్రోలితిఁ గాన జీవునిన్
మేనును వేరుచేసి వడి నీ దరిఁ జేర్చవొ వేంకటేశ్వరా! 135

చేటు త్వదీయ నామ ఘనచింతనయే కద హన్మ సత్తకుం
జేటు త్వదంఘ్రి సంస్పృశమె చేతన మొందగ గౌతమోధకుం!
జేటు త్వదీయ దర్శనమె చెంచెత పొందగ దివ్యధామముం!
జేటొనరింపు మస్మదఘ సిద్ధిని సర్వము వేంకటేశ్వరా! 136
(చేటు=కారణము, నాశము)

ఏను నితఃపరంబెరుఁగ! నీవ సమస్తమటంచే నైతి నీ
కే నతమస్తకుండ! భవదీయ కృపేక్షణరక్షణప్రతీ
క్షానుక చిత్తవృత్తి బ్రతుకంతయుఁ బుచ్చితి! త్వద్దయా సుధా
పానమికెన్నడబ్బుఁ? ద్వదుపాసకు నెన్నవొ వేంకటేశ్వరా! 137

నాకును నీకు బంధము సనాతనమయ్యది! నేలపైన నే
నీకడ నొక్క జీవునిగ నేర్పడి యుంటిని! నేడుకొండలం
దాకడ నీవు దేవునిగ నాముకొనం బయి! వేఱుకన్పడుం
బోకడ కాని యాత్మ పరిపూర్ణమదొక్కటె వేంకటేశ్వరా! 138

కసవును మేసి పాలనిడు కౌశల లేశము లేదు మాకడన్,
గుసుమరసంబు పట్టి మధుకోశము గూర్చెడు ప్రౌఢి నాస్తి మా
కు, సలిలమొక్కయింతఁ గొని కుల్యఫలంబుల నిచ్చు చెట్లఁ బోల్
బస పెను సున్న! మా నరుల బల్మియు బల్మియ వేంకటేశ్వరా! 139

తెల్లని పాలసంద్రమునఁ దీరగు శేషుని దర్వి ఛాయలో
నల్లని కజ్జలాచల మనందగు త్వత్స్థితి తెల్లతమ్మిఁ జో
చ్చిల్లిన జేంటియాగఁ దలపించెడు! క్షీర పయోధిఁ ద్రచ్చఁ జి
ప్పిల్లిన శూలి త్రెక్కొనని క్ష్వేళము దోచెడు! వేంకటేశ్వరా! 140

**పంచ చామరం**

కుటుంబమందుఁ దల్లియొద్ద కొద్దియైన సంస్కృతిన్
బటుత్వమున్న సంతతి ప్రవర్తనన్ ఫలించుగా!
కుటంపు పాదునం దుదంబు గూర్చి పోయ శాఖలన్
ఘటిల్లి పల్లవింపజేయుఁ గాద వేంకటేశ్వరా! 141

కలవని నాలుగైదవు రకంబుల ముక్తులు పండిత ప్రకాం
డులు నుడువంగ వింటిని! ననుం గరుణింపగ నేదొ యొండు నీ
వలదు! విదేహముక్తి ననివార్యముగా నిడు మింక! జాలమిం
తలయెను జన్మజన్మలిఁక తక్కినవేటికి వేంకటేశ్వరా! 142

పోయగ నారమందు లయముంగొనుఁ గాదొకొ యుప్పు చక్కెరల్
బ్రాయికమైన రీతి రుచిరమ్యత వేఱిమి లెక్కలేక! యా
న్యాయమునన్ సుశీలుడనొ ఆట్లఁడనో లయమొంద నేను నా
రాయణు సచ్చిదాకృతి సమంజసమే కద వేంకటేశ్వరా! 143

(ఆట్లఁడు=దుష్టుడు)

అసురులకు న్వరంబులిడి యాపదలం బడ నా యమాయకుం
డసమవిలోచనుం దడవ నాలసమెంచేక పోదువీవు దీ
మసమున! గుండెతట్టసది మాకును నీవలె నుండునయ్యొ త
ల్లి సిరి వసింప మాహృదియు లీలను జూపుమే వేంకటేశ్వరా! 144
(తట్టస= ధైర్యము)

అన "కమృతాపిధానమసి" యక్షయమెట్లవు రౌరవాద్యపు
ణ్యనరక వాసకోటులకటంచే మదిం దలపోయు చేను భో
జనమును మానఁ గొంకుదును సద్గతి వారికిఁ గూరఁ గాని నా
కనశన దీక్షఁ జేయ వెఱ యన్నది కాదయ వేంకటేశ్వరా! 145

జను లుపవాసకర్మఁ బరసాధన కుత్తమ మార్గ మెంచి తా
ము నిరశనవ్రతంబులనుఁ బొట్ట కృశింపఁగఁ జేయుచుంద్రు గా
ని నియమమర్మముం దెలియ నేరరు! ధ్యానము ధ్యాసయందు నీ
శుని పదమంటి యుండుటను సూక్ష్మమెరుంగరు వేంకటేశ్వరా! 146

**పంచ చామరం**

ఘనంబుగా వ్రతంబులెన్నొ కామితంబు లందగా
నొనర్తు రెంతొ వేడ్కఁ బూని యుక్తవస్తువుల్ స్థలం
బునున్ముహూర్తమంత్రతంత్రముల్పురోహితుండు కూ
డునయ్యు నంతరంగ శుద్ధి డొల్ల వేంకటేశ్వరా! 147

పిలుచేను బంధుమిత్రులను బేరునఁ బెక్కుర నీ వ్రతంబటం
చెలమిని, విప్రునొక్కని వహించేగ బ్రహ్మపదమ్ము బిల్చుఁ దాఁ,
బిలుచేను విందువేడ్కలకుఁ బ్రీతిని వంటరిఁ బాటగాంద్రనుం
బిలువగ విస్మరించు నిను బేరిమి రమ్మని వేంకటేశ్వరా! 148

కుండలి పాన్పుపైనఁ దమ కోమల పాదయుగమ్ముఁ నొత్తు పూ
దండల నాఁ జెలంగు బిసతంతు కరంబుల పద్మపాణినిన్
మెండుగ నెమ్ముకొన్న తనమెత్తని బుగ్గల దువ్వువేళ త్వ
న్మండిత హస్తతీక్ష్ణనఖ మందనిఘర్షము నోయఁజేయునో
చండ నృసింహమూర్తి! తగు జాగృతిఁ జొగుత వేంకటేశ్వరా! 149

సత్తువ యూడెఁ జేరె మలి సంధ్యకు జీవనమింక! సర్వ సం
వేత్తవు! మద్గుణాగుణ నివేదన సేయ నగత్యమేమి! త్వ
త్సత్త నెఱుంగకుంటి నలసత్వమున న్భవసంగినై! దయా
వృత్తి సహించి జన్మవినివృత్తి నొసంగవొ వేంకటేశ్వరా! 150

వక్షపుఁ దెల్లమచ్చను శుభంబని వీడక జన్మజన్మలం
దే క్షణమందు దాని వహియింపగ నేమఱకుందు వొమ్మికన్!
శిక్ష యదేమొ తెల్లమెయి శ్రీహరు కుత్తుక నల్లమచ్చ, సం
రక్షణఁ జేసి పొందె నవలక్షణ మయ్యయొ వేంకటేశ్వరా! 151

ఒడబడ రొక్కరొక్కరను నోడరు వాక్కుల వాదమందునన్
గడబిడ చేసికొందు రతిగాఁ దమగుట్టును రట్టుచేయుచున్
బడుగును బేక పోని పతిపత్నులు కాపురపుం బటాన సం
గడిగొని యుండ మేలుగద! కల్మికిఁ బెన్మిటి వేంకటేశ్వరా! 152

పెట్టును బట్టెనామములు! పెట్టును బొంగలి భోగసాదమున్!
మెట్టును నేడుమెట్టుల ననేకపు పట్టుల చీటిమాటికన్!
గొట్టును నారికేళఫలకోటుల నొట్టులఁ జెక్కఁబెట్టగా!
పెట్టును బూలగుట్టలను బ్రీతిగ నీపయిఁ! బట్టెడన్నమె
వ్పట్టున పెట్టగిట్టదయె ప్రాణికి దేనికి! నట్టి వానినీ
వెట్టుల గట్టుఁ జేర్తువని యెంచెడొకింతయు వేంకటేశ్వరా! 153

రాపిడి పెట్టినం దనను ప్రయ్యలొనర్చిన నగ్గిఁవేల్చినన్
జేపడఁ జేయమానునె విశిష్ట నిసర్గ పరీమళమ్ము సం
తాపము నోపి గంధకుఠి! తాను నుదల్చడు సౌమనస్యమున్
నీపద సంగి యట్లె కడు నెవ్వల సైఁచేచే వేంకటేశ్వరా! 154
(కుఠి = చెట్టు ; నెవ్వ = ఆపద)

చేతికిలి యొక్కగద్దెపయిఁ జేక్క సుకంబుగ మేనునాన్చి ప
ద్ధతి నలమేలుమంగ నిను దాపునఁ జేర నమస్యలందకీ
గతి నిలుకాళ్ళ బేరమున గాసిని నెత్తు కతమ్ము భక్తసం
తతి మొరవెట్టఁ బ్రోవఁ ద్వరితమ్ముగఁ బోవనొ వేంకటేశ్వరా! 155

'మమ'ను విడన్ లభించేఁ గద మానిసికిన్ భవ ముక్తి సద్యమే!
సమదృశియౌచే మెల్గుటను సర్వచరాచరసృష్టి యందుఁ "ద
త్త్వమసి" తనంత బోధపడుఁ! దత్త్వము తానుగఁ దేటతెల్లమై
న మెయి మదీయముం గణకణంబును నీవెగ! వేంకటేశ్వరా! 156

చేల్లని తల్లి జిడ్కడలి సంభవ బంగరుచేన తానుగా
నల్లని వాడవం చేక క్షణంబయినన్ హృది స్రుక్కకుండ నీ
వల్లభయైన కీలక మవశ్యము నచ్యుతుఁ డంచు గాదొకో!
పిల్లలమైన మా యెద నపేక్షయు నయ్యదె వేంకటేశ్వరా! 157
(జిడ్కడలి=పాలసముముద్రము)

ముప్పిరిగొన్న యిక్కటుల ముగ్గి స్మరింప హరీ యటంచు మా
తిప్పలనున్ హరింపగఁ బ్రతిక్షణమున్, బరికింపవే కదా!
లప్పల కాన్కలిచ్చు కరలాఘవ తస్కర భక్తవేషులం
దప్పుల నొప్పి కాచే త్వదుదారత శ్లాఘ్యము వేంకటేశ్వరా! 158

పులుగుల రాయుడెత్తెనన మోయగ దుష్కరమైన మంథరా
చలమును, నౌషధీధరము సత్వర మెత్తి కరంబుఁ బట్టి తా
సులభ తమంబుగాఁ బవన సూనుడు మోచె ననన్, యథార్థమా
బలిమికి బీజమీవ కద స్వామి! యొకింతయు నట్టిదౌ మనో
బలము నొసంగుమయ్య భవ భారము మోయగ మాకు శక్యమౌ
వలసిన యంత! భక్తపరిపాలన తత్పర! వేంకటేశ్వరా! 159

దాగుడుమూత లాటలను దక్కక యేరికిఁ జిన్న నాట నా
నా గెలుపున్ మదీయఘన నైపుణమెంచేచు విఱ్ఱవీఁగితిన్!
ఆ గుదెతాల్పు దాగి వెనునంటి యనుక్షణమాఁడు కేళిలో
నే గెలుపొంద బ్రాఁతియని నేర్వక పోతిని వేంకటేశ్వరా! 160

బలి నడచేంగఁ బన్నికొన వామన జాతము, కశ్యపుండు దా
సలిపినవేళ నీ వడుగు, జేక్కుల జేఁడిడె భిక్షపాత్రనుం
బిలుగయి కాన్కగా! సిరిని వీడిన నీ దశ నవ్వుఁబాటు గా
నిల మముబోంట్ల కేమిగతి! యెవ్వఁడు లెక్కిడు! వేంకటేశ్వరా! 161

చెఱను వదల్చితే పయినిఁ జేరిచి మాతులు నుగ్రసేనునిం
గరమిడి రుక్మిణిన్ సతిగఁ గానిడి కన్నచెఱన్ వదల్చితే!
నరకుని బందిగీలయిన నాతుల కన్నెచెఱన్ వదల్చితే!
పటిపటి పుట్టు నాదు చెఱపట్టు వదల్చవొ వేంకటేశ్వరా! 162

సూకర కూర్మమత్స్యము లసుందరముల్ గట! వాటి రూపముల్
నీకు వహింపనయ్యె నెటు! లేశము సెగ్గెము దోఁచేకుండెనో!
యో కరిరాజరక్షక! త్వదుల్లము నందునఁ బ్రాణులెల్లఁ దా
రేకము నాత్మరూపమని యేర్పడఁ జూపితొ వేంకటేశ్వరా! 163

కన్నుల మూసియుంచి కసుఁగందుగ సవ్వడి సేయ కేను లో
నిన్ను స్మరించుచుచే న్వెలికి నేలఁ బడంగను దత్ క్షణమ్మునన్
నన్ను బిఱుందుపైఁ బ్రహరణంబుల నేడ్వగఁ జేసిరా పయిం
బిన్నతనంబునుండి యిటు వృద్ధుడ నౌవర కేడ్పుగొట్టునై
యిన్నిదినాలకున్ నిను స్మరించెనొడంబడె వేంకటేశ్వరా! 164

పసితనమందు సృష్టిఁగల ప్రాణులవెల్లను సాధుజీవులే!
అసలు సబాము గానఁగ వయఃపరిణామమునన్ బయల్పడున్!
పసువుల జాతిలక్షణపు సంగతి యాకులు మారువేయఁగాఁ
బసగును గాని పుట్టుఁగల పత్రము దెల్పునె వేంకటేశ్వరా! 165
(సబాము = స్వభావము)

జారిన నొక్కమారయినఁ జాలుఁ ద్వదీయసహస్రనామ సం
భారము నందెదోయొకటి ప్రాణము జాఱు క్షణాన నాల్కనున్!
కారియ లందఁబోడు గద కాలుని సేతుల నెట్టి బ్రక్కయుం!
దేరిచి యా యజామిళుని నిర్మలుఁ జేయవె వేంకటేశ్వరా! 166

విమల వియన్నదీజనక వేంకట శ్రీచరణాబ్జపృక్తి నొ
క్క మునిసతీపతుల్ గలియగాఁ గృపఁ జేసిన త్వద్భృదిన్మరొ
క్కముని పదప్రహారమిడి కారకుడాయెఁ గదా సతీవియో
గమునకు నెంతచిత్ర ముపకార ఫలంబిదొ? వేంకటేశ్వరా! 167

**సుగంధి**

ఫుల్లరీకతల్పసుప్తభోగమార్చితాంగికా! (మా+అర్చితాంగికా)
యల్లకాఘకశ్మలప్రహారదక్షరక్షకా!
ప్రోల్లసత్ స్మితాధరప్రభోజ్వలేందువక్త్ర! శ్రీ
వల్లభా! ప్రసీద! వారివాస! వేంకటేశ్వరా! 168

పుట్టినఁ దోడనే మొదలు పొట్టను నింపగఁ బ్రాఁకులాఁడు! కే
ల్పట్టఁగఁ బ్రాకులాఁడు నొక స్వామినిఁ బెద్దయి! బొట్టె బొట్టెలుం
బుట్టఁగఁ బ్రాకులాఁడు ముది! మోహపు గంతల గానుగాట ని
క్కట్టులఁ దీర్ప ముద్దులను గట్టుచే నీదయ దేవులాఁడుఁ గా
నెట్టి పరిస్థితిం దలపడించేక పూర్వపరమ్ము లేవొ యీ
పుట్టుక కంచె నొక్కక్షణమున్! విధి చిత్రము! వేంకటేశ్వరా! 169

గొల్లత లిండ్లఁ జొచ్చి చేవిగొంచేను గోరస మంథజమ్ములం
గొల్లగొనంగ సార్థకత కూరెనొకో హరియంచుఁ బేర్కొనన్?
అల్లరి చిల్లరాటలను యల్లక శూరుడ! సంహరించి నా
యుల్లమునున్న షడ్రిపుల యోగ్యతఁ గూడవొ వేంకటేశ్వరా! 170

పంచమి షష్ఠియుం జెవితి పండుగ నాళ్ళను గాలిదిండికిం
గుంచెడు పాలువోయ సమకొందురు పుట్టల చేట్టు మెట్టుచేం
గొంచెముఁ బొట్టక్రిందుఁగల కుండలినిన్ గుఱుతించి లేపగా
నెంచేరు మాడులోనికది యెక్కను ద్రోయరు వేంకటేశ్వరా! 171

బుడుగువు గానఁ గుబ్జఁ గృపఁ బ్రోచితివో! గజలక్ష్మికొట నీ
వొడయుఁడ సామజాధిభువు నోమితివో! వరమోహినీ స్వరూ
పుడ వయినట్టి హేతువనఁ బ్రోచితివో ద్రుపదోద్వహన్! పుమాం
సుడ మరి నన్నుఁ బ్రోవఁ బెడమోమువడంగ నదేలకో మను
ష్యుడవయి పుట్టువొంది పురుషోత్తమ పల్మఱు! వేంకటేశ్వరా! 172

పసితనమందు నన్ను సహవాసులు రక్కెసమేళమాడుచుం
గసరిన వేళ, నాయెద దిగాల్పడి ఱోలగ, యూరడింప మ
త్ప్రసువు, కుమార! వారను పరాచకముల్ "నిను" గాదులే యటం
చు సరసవాక్కులం బలుకుచుండెడు! నన్నన "నేను" వేరుగాఁ
బొసగుడు తత్త్వమప్పుడయ బోధనొనర్చెను గాని నాదుమా
నసమున నద్ది నాటుకొన నాకెపుడయ్యెడు వేంకటేశ్వరా! 173

మెట్ట నశోకదోహదము మెక్కొను, ముట్టిన షట్పదాతిథిన్,
బొట్టుగు చూడ్కి చేత, సురపొన్నల నవ్వుల రుప్ప, నాయటుల్
దట్టియొ తన్నియో యెడఁద ద్రుమనున నీ పదభక్తి సూనముల్
బుట్టఁగ దోహదక్రియనుఁ బూనవొ నాయెడ వేంకటేశ్వరా! 174

రెక్కల టెక్కు వెక్కుడని లేలిహలేహకు నెక్కిరింతగా
మక్కువ నెక్కి త్రిమ్మరు రమాధవ! పన్నను వక్కిపక్కినిం
బక్కకు నెట్టి నాయెడఁద పక్కిని నెక్కుడు సేసికొన్నఁ దా
మిక్కిలి వే చేనుం జెమి సమీరుని మీఱుచు వేంకటేశ్వరా! 175

ఆనిలి మూపునెక్కి తిమి నట్టెడ దాటితి మల్లుదాటులం
బూనుచు బంతినోళ్ళ పెడబుద్ధుని మోదగ! నా యెడందయుం
దానొక తిమ్మఁడేను! నొగి దాని బుజమ్మెగి మార్గదర్శివై
పోనిడఁ జేయుమయ్య భవబుద్ధిని నాకటు వేంకటేశ్వరా! 176

లవణ సముద్రమందలి జలమ్ముల యావిరి సేచకమ్ములై
చేవిగల నీరముల్గురియ శైవలినుల్ ప్రవహించి సంద్రమం
దవుఁగద యైక్యముం దుదకు! నట్టి విధాయకమే పొసంగఁ జే
యవొ మన బ్రహ్మజీవ పరమైక్యము గట్టిల వేంకటేశ్వరా! 177

నీ చెయి చేఁపి కాద నవనీతముఁ గొంటి యశోద పెట్టగా!
చేఁచితి కాద నీ కరము సంగడి ముందటుకు ల్బసాపడం!
జేఁచక కేలు, కాళ్ళజేతఁ జేఁచి ప్రదానము నొందఁ గంటిమే
యాచకు నెవ్వనైన! కపటావని దేవున కేది యుక్తమో
తోఁచేనె దానమందు నియతుల్! బలినిగ్రహ! వేంకటేశ్వరా! 178
(పసాపడు = తిను)

భంగము లుర్విపైఁ జని కబంధము వీడి, తిరోగమించేన
బ్భంగి మదంగజీవునకుఁ బ్రాప్తము గావలెఁ గాద స్వామి! త్వ
త్సంగ మవశ్య మచ్యుత! నిధానము జీవులకీవ కావుటన్!
భంగమొనర్పరావొ భవబంధ పురోగతి వేంకటేశ్వరా!! 179

**ఉత్సాహ**

వేయిపడగ లెల్లిఁ గునుకు వేయికనుల జేజవో!
వే యడుగుల మేటి యయ్య! వేయి తలల సామివో!
వేయి యింతలిడినఁ గాద వేడుకున్నదానికిన్
నీ యెలమిల వాసికెక్కి నెఱయు వేంకటేశ్వరా!! 180

బూడిద గుమ్మడిం గనఁగ ముక్కనుసామి యెడందఁ దోఁచే, లో
నాఁడును గొంతమందికి నయత్నముఁ జేరల పుచ్చెపండునుం
జూడగ త్వన్ముఖోదజమె! చోక్కిడు భక్తమహాత్ములెంచే నా
పోఁడిమి మన్మనంబునఁ బ్రబుద్ధమొనర్పుమ వేంకటేశ్వరా! 181

పాచికలాటఁ బ్రాణులను బావులఁ జేసి యథేచ్ఛ నాఁడుచుం
బ్రోచెడు వాని లీలఁ గరముద్రను జూపుచేఁ గిక్కురింతువో!
నీ చెయిదమ్ము లింక విడి నీ చెయి తమ్ముల మమ్ము నోమవో!
ఆచి పరాచికమ్ముల సమాగతిఁ గూర్పవొ వేంకటేశ్వరా! 182

ఏవియొ బత్తివిత్తనము లీయెద బీడున గాలివాటునం
దావుకొనంగనయ్యెఁ జిననాటనె! యీరికలీన నొల్లవున్
సావి గతించినం గరము! సాకతముం గురియించె సోనగా
నీవట బత్తిసాగు నొనరించెద నీయెడ వేంకటేశ్వరా! 183
(సావి = కాలము; సాకతము = అనుగ్రహము)

చందనలేహ్యలేపన ప్రశస్త సపర్యను లింగరూపముం
బొంది త్వదీయదర్శన ప్రమోదముఁ గూర్తువు భక్తకోటికిం
గందువ నీవునీశుఁడు నొకండ్రన వేంకట నారసింహమై!
పొంద నభిన్నభావమటు పోఁడిమిఁ జూపితె వేంకటేశ్వరా! 184

పాముల నంటకాగుటను, భక్తుల బాముల వట్టి సేయుటన్,
స్వాముల రీతి ధ్యానము దపంబును యోగము సేయుటందుఁ, బెం
డ్లాముల మేనఁజొన్పి యనురాగముఁ జాటెడు తీరుతెన్నులన్
లేమియ భేదమీశునకు నీకనఁ జెల్లును వేంకటేశ్వరా! 185

**ఉత్సాహ**

మాతులానురాగఁపుటెద మాలిమిని గజాస్యునిం
జేతముల్లసిల వినోదచేష్టల నొనరించుచున్
స్వాతిశయమున నరసింగ సామిగఁ గనుపింపఁగా
మేన, భీతి నేద్పఁ దొడవ మేనయల్లుడప్పుడా
మాత భద్రకాళియౌచు మందలించెగా నినున్!
జేత తూతకొమ్ము వాఁచు చిన్నికృష్ణునివయి యా
శీత నగజసుతుఁ బునర్వసింపఁ జేసినట్టి నీ
చాతురికి ఘటింపకెటు ప్రశంస వేంకటేశ్వరా! 186
(తూతకొమ్ము = మురళి; వాఁచు = ఊదు)

**ఉత్సాహ**

అర్థపతివి నీవు నేస్త మర్థపతియు నీకుఁ దా!
స్వార్థసురల కీవు పతివి స్వార్థ దైత్యులకతఁడున్!
స్వార్థపరులు నరులటంచు వ్యర్థవాదమేల! యి
ష్టార్థములిడి మమ్ముఁ గావుడయ్య వేంకటేశ్వరా! 187

ఆయుధమేది ముట్టనని యైచ్ఛికమైన ప్రతిజ్ఞఁ బట్టి కౌం
తేయులఁ జేరి ఫల్గునుని తేరును ద్రోలితివట్లు గాని నీ
వే యొక పోటుముట్టు గద యెన్నగఁ బాండవ పాళికిన్! సుభ
ద్రాయితమూర్తి! చేచ్చిరి గదా రణవీరులు మున్నె నీ కయిన్!
స్వీయ మనోరథమ్మె నడిపింతువు నెట్టన వేంకటేశ్వరా! 188

మునుకొని లింగరూప శివమూలముఁ గన్గొనఁ బోయి కానరా
ని నిజము నూలుకొంటి! వవనిన్ రఘు రాముఁడవై యదేవిధం
బు నడచి చూపితీవు గద పూని వ్రతమ్ముగ సత్యపాలన
మ్మనఁగను సత్యదేవుఁడని యందరు నిన్నని వేంకటేశ్వరా! 189

**ఉత్సాహ**

నల్లనయ్య నీకు కనకనారి లక్ష్మి భార్యయౌ!
నల్లనప్పకేమొ శ్వేతనభవుఁడయ్యె భర్తగాఁ!
దొల్లి మీరు త్రొక్కినట్టి త్రోవనిప్పుడీనరుల్
పెండ్లియాఁడ వెల్లతోలు వెదకు వేంకటేశ్వరా! 190

నిజేమును బల్కుటందు స్తవనీయుఁడ! లింగపు పాదు నెయ్యదో
యజపజ పట్టఁగ న్విఫలమైన ప్రయత్నము నొప్పితీవు! త్వత్
స్వజుడగు వేధ పల్కెఁగద దబ్బఱ! మా నరజాతి కబ్బ ప
ద్మజుని ప్రవృత్తి యబ్బెనవు! మన్మలఁ గాయవౌ వేంకటేశ్వరా! 191
(దబ్బర = అసత్యము)

పూవులలో మరందము నపూర్వముగా మఱుపెట్టి జుఱ్ఱు పుం
భావము తేనెటీఁగ కిడి మాకయి మైనపు తిత్తి లోపలం
బ్రోవుగఁ గూడఁబెట్టఁగఁ బ్రబోధమొనర్చెడు నీ విభూతి నే
నేవిధిఁ బిచ్చెలింతు నిను సృష్టి విదగ్ధుని వేంకటేశ్వరా! 192

యమ మహిషాగమంబున భయంబును బొందఁగ నోపు నయ్యునున్
మముఁ గనిపెట్టఁ దిర్మలను మన్నియ డొక్కఁడు భక్తరక్షణా
ర్థ మవతరించి యుండెనను ధైర్యము నమ్మిక తోడఁ గొల్తురే
యమల మనస్కులై జను లనంతుని నిన్మది వేంకటేశ్వరా! 193

తాతకు శ్రీనివాసుఁడని తాతయ తండ్రికి వేంకటాచలం
బాతని తండ్రికిం దిరుపతయ్యగఁ బేళ్ళు మదన్వయంబునన్
దాత! తరాలనుంచి నిను నమ్మితి మేనును వేంకటుండనుం
ద్రాత! పురాతనాప్తి యిది! తప్పునె కావఁగ వేంకటేశ్వరా! 194

త్వత్కృత వీక్ష్యసృష్టిని విధాత జగంబుల నచ్చిపోయు నా
పత్కరమౌ కొరోనకృమిఁ బట్టి సృజించితి వేల స్వామి? యా
వత్కుధరంబు సంక్షుభిత భైరవ జీవన రంగమయ్యె భా
వత్కకృపాకటాక్షపరిపాలన సేయుమ వేంకటేశ్వరా! 195

బాధల ప్రోవులైన భవబంధపు పుట్టు లవేలకో జగ
న్నాథ! త్రివిక్రమాకృతిఁ బ్రతాపముఁ జూపి వియత్తలంబునున్
వైధృతియై బలీంద్రుడు గనన్ మునుగప్పిన కాలినీడనన్
భూధర! నాకుఁ బ్రాపునిడి ముక్తునిఁ జేయుమ వేంకటేశ్వరా! 196

రీతిగ 'నేతి నేతి' యను రిక్తసమూహలఁ జేయ మానుచేం
జేతముఁ బ్రత్యగాత్మ పయిఁ జేరిచి శాస్త్ర విధాయకమ్ముగా
లోతుగ సోఽహమంచే నిజరూప విచారమొనర్ప నా పరం
జ్యోతి త్వదీయభాతియను సూక్ష్మమెఱుంగరొ వేంకటేశ్వరా! 197

పదిలము గాదు వృద్ధత! సపర్యలు సేసి కుటుంబ బంధులున్
ముదిమిని గారవించే దినము ల్సనె! మూడవ యాశ్రమంబు త
ప్పదను పరిస్థితుల్ ప్రబలవంతము లయ్యెను దీనబంధు! త్వ
త్పద వనజద్వయాంతిక ప్రవాస మొసంగవొ వేంకటేశ్వరా! 198

అంతయు మిథ్యయంచే నొకఁడారసి తాను బ్రసిద్ధినొందు వే
దాంతిగఁ, గాంచేచేం దనకు దానును బ్రహ్మగ ద్వైతశూన్య సి
ద్ధాంతిగ సిద్ధిగాంచొకఁడు! తత్త్వము వాస్తవ మీవయే! విశు
ద్ధాంతము నిమ్ము నాకు పరతత్త్వమెఱుంగను వేంకటేశ్వరా! 199

చివరకు నూలుపోగయిన శేషము నుండదు కాటఁ గాలు నా
యవసరమందుఁ గట్టెపయి! నాదియు నంతము నొక్కతీరె యీ
భవమునఁ! బుణ్యపాపము లవశ్యము వెన్నడి యంటివచ్చు నా
యవి సకలంబు మాయఁగ దయంగను! చాలును! వేంకటేశ్వరా! 200

చినతనమందె భక్తియను క్షీరము నుగ్గున రంగరించి పో
సిన యది బుద్ధిఁ జొచ్చి తన జీవితమెల్లను ధన్యమౌఁ గదే
మనుజునకున్! ముదిం బడయ మారకవేళను సార్థకంబొ! మో
దునకిడ వేలచేదల కడుంగడు నీరము తుర్తుఁ బండుని
చ్చునొ! యొగి హ్లాదునిన్ ధ్రువునిఁ జూచియు నేర్వరె వేంకటేశ్వరా! 201

గాలికిఁ గొమ్మలూఁచే ద్రుమ్ముఁ గాంచి తలంపగ నౌన తానె యా
గాలిని వీచుచున్నయటుఁ! గానఁగ నట్టులఁ గాదె మాదు లో
గాలివి నీవయై నడుపఁగా భ్రమియింపగ మా నరుల్ స్వయం
పాలకులైన రీతి మతి మాలిన భాతిని వేంకటేశ్వరా! 202

గుప్పిళులన్ బిగించి తనకోమల హస్తములందుఁ దానెదో
గొప్పగఁ జేసి చూపెదను గొండల పిండి నొనర్తునంచుఁ గన్
విప్పును భూమిమీఁదుఁ! బిడి విచ్చక పోవును నంత్యవేళనుం
జెప్పుచుఁ దత్త్వ మేది మన చేతుల లేదని వేంకటేశ్వరా! 203

నా యనుకొంచు బంధువుల నా యనుకొంచును దల్లిదండ్రులన్
నా యనుకొంచు స్నేహితుల నా యనుకొంచును నాలుబిడ్డలన్
నా యనుకొంచుఁ గాసుల మనంబును నించితి! నీక పోతి నో
నాయన చోటు నీకు! మదనాదర మోర్చుమ వేంకటేశ్వరా! 204

భ్రుకుటిఁ బ్రతిష్ఠ చేసి దృశి, మూయుచు గన్గవ నే సమాధి లో
నికిఁ జనఁగాఁ బ్రయాసపడ నేర్తును గాని మనంబు నిల్వకు
న్కి కతమదేమనం జపల నీ యనపాయిని నాయెడందఁ బా
దుకొనుట యౌను! నా వలన దోషము గాదయ! వేంకటేశ్వరా! 205

నేనొక జీవకీటమయి నీపయి నిశ్చల భక్తిభావనా
ధ్యానమిళిందఘూర్ణన విధానవశంబున నేదొ యొక్కనాఁ
డేనును రూపు నొందనొకొ యేర్పడ నీవుగ కేవలా! మెయిం
బ్రాణము లుండుదన్క నిను మానను ధ్యానము వేంకటేశ్వరా! 206

శ్రద్ధ వహించి త్రేతఁ దన శస్త్రము లస్త్రములెల్ల నేర్పి సం
వృద్ధినిఁగూర్ప నీదు విలువిద్యకుఁ గౌశికుఁ డెంచి తోడ్కొనన్
బద్ధకమంద మేల్కొనఁగఁ బ్రత్యుష మందున మౌని లేపెగా!
బుద్ధిఁ దలంతు మెట్లు నినుఁ బూని వెసన్ బిజమాడు భక్తసం
బద్ధుఁడవంచు మాదు ప్రతిపాలనఁ జేకొని మాకు మోక్షసం
పద్ధితముం బొనర్చు మతిమంతుడ వంచును వేంకటేశ్వరా! 207
(బిజమాడు = వేంచేయు)

కోరఁగ నిన్ను ముక్తి నిడ గొంతెమ కోరికగా హసించెదో
కోరఁగ లేదొ మిన్నుఁ గల కోకనద ప్రియుఁ జేకొనంగ నాఁ
డా రఘురామ బాలకునివై! మఱి నేనును బాలకుండనే
నీరజనేత్ర నీకు! నిడ నీవిధి కాదొకొ వేంకటేశ్వరా! 208

నిందను బెట్టకయ్య నను నిండుగ నీపయి భక్తి లేదటం
చిందుని కంటినో పొర వహించి గణేశ చతుర్థి నాఁడు గో
వింద! శ్యమంతకంపుఁ గత వింటిఁ బఠించితి నయ్య నేనిటుల్
బొందగ దూఱుఁ బాడియొకొ? మున్పిడినట్టి వరంబు వమ్మొ? కా
మందువు నీవు! నీకొలువు మానిసి నేనయ వేంకటేశ్వరా! 209

భౌతిక సంపద ల్వలచి భార్గవినిన్ హృది నిల్పి కొల్చువాఁ
డీతఁడు ప్రీతిమై యనుచు హేయముగా నిరసించకో ననున్!
మాతను వెన్కుకొంచే బిజమాడుదు వీవు మదంతరమ్ము నా
రీతిఁ దలంచితింజుమి! నివృత్తియ మత్స్మృతి యప్పసమ్మునై
మాతయ మోక్షలక్ష్మి కద! మర్మమెఱుంగుదు వేంకటేశ్వరా! 210
(వెనుకు = వెతుకు)

## ఉపసంహారము

అరయనివాఁడ గుంఫనము! వ్యాకరణాంబుధి యొడ్డునందు న
చ్చెరువున నిల్చిచూచు భయశీలుఁడ! ఛందము నొంటఁబట్టలే
దు రవయు! సాహసించితి నెదో లిఖియింప! భవత్ప్రసాదకృ
ద్విరచిత మిద్ది! కైకొనుమ దీనిఁ బ్రియంబున వేంకటేశ్వరా! i

ఎందరు మున్ను నిన్ను నుతియించి తరించిరొ సత్కవీశులా
యందరికన్న నే ఘనుఁడనా నినుఁ గ్రొత్తగఁ జూపి చెప్పటన్!
కందువ తీరుమారుటయె కాని సుమాలవె హారమందనన్
చేందము వేరుగాని పదజాలము ఛందము భావమయ్యవే!
అందును నేను సెప్పితిన! అంతయు నీదయ వేంకటేశ్వరా! ii

**ఓం నమో వేంకటేశాయ !**



# జననీజనకులు



**వాస్తుజ్యోతిష విద్వాన్, దైవజ్ఞ రత్న,**
**కీ.శే. బ్రహ్మశ్రీ కవితా కామేశ్వరశర్మ,**
**కీ.శే. రాజ్యలక్ష్మి**

కీ.శే. బ్రహ్మశ్రీ కవితా కామేశ్వరశర్మ సిద్ధాంతి గారు (1916-1990), అవనిగడ్డ, కృష్ణాజిల్లా, ఆంధ్రప్రదేశ్ వాస్తవ్యులు. ప్రసిద్ధ వాస్తుజ్యోతిష విద్వాంసులు మరియు పంచాంగకర్తలు. గొప్ప తపశ్శాలి. “అద్వేషీ నిత్య సంతోషీ గణితాగమ పారగః। ముహూర్త గుణదోషజ్ఞో వాగ్మీ కుశల బుద్ధిమాన్॥ శాస్త్రశ్చామృత వాక్సౌమ్య స్త్రికాలజ్ఞో జితేంద్రియః। నిత్యకర్మరతో యోవై సదైవజ్ఞ ప్రకీర్తితః॥” అను శాస్త్రవిహిత దైవజ్ఞ లక్షణోపేతులు. సంస్కృతాంధ్రాంగ్ల హిందీ భాషాభినివేశముతో అనేక పూర్వ సమకాలీన ప్రాచ్య పాశ్చాత్య జ్యోతిష నిగూఢ సంప్రదాయాలను గురుసంప్రదాయ పద్ధతిలో లోతుగా అధ్యయనము చేసిన వారు. గొప్ప ఉపాసకులు. వాక్శుద్ధి సంపన్నులు. ప్రచారార్భాటాలకు అతి దూరముగా, అతి నిరాడంబరునిగా, ధనార్జనకాంక్ష లేక, శాస్త్ర ప్రయోజనాన్ని తనవద్దకు వచ్చిన వారికి సంపూర్ణముగా అందజేసిన నిష్కల్మష లోకహితులు. “ సర్వం ఖల్విదం బ్రహ్మ ” అను ఆకళింపుతో జీవితాంతము మెలగిన ఆధ్యాత్మిక యోగి. నాకు తండ్రి. గురువు.

– కవితా ప్రసాద్



# కవి పరిచయం

| | |
|---|---|
| రచయిత: | కవితా (వేంకట సూర్య నారాయణ) ప్రసాద్ |
| జననం: | 1955 |
| ఊరు: | అవనిగడ్డ, కృష్ణాజిల్లా (ఆం.ప్ర) |
| తల్లిదండ్రులు: | వాస్తు జ్యోతిష విద్వాన్, దైవజ్ఞరత్న బ్రహ్మశ్రీ కవితా కామేశ్వర శర్మ, రాజ్యలక్ష్మి. |
| చదువు: | MSc (chemistry), PG Dip. (Appd. Statistics),(PhD)<br>స్కంధ త్రయ జ్యోతిషము (వారసత్వము). |
| వృత్తి: | D.G.M (retd.), ONGC. |
| అభినివేశము: | పద్య, వచన కవిత్వములు, కథారచన,<br>వాస్తు జ్యోతిష ముహూర్త శాస్త్రములు. |
| రచనలు: | వివిధ పత్రికలలో పద్య గద్య కవితలు, కథలు, వ్యాసాలు,<br>ఆకాశవాణి పద్య సమస్యాపూరణలు,<br>వివిధ కవితా సంకలనములలో రచనలు. |
| గ్రంథములు: | శ్రీ రాజశేఖర శతకము,<br>శ్రీ వేంకటేశ్వర ద్విశతి,<br>కొరోన వారణార్థనా పద్యపంచాశిక<br>కావవే! కామేశ్వరీ!! (శతకము),<br>ప్రవచన కవితా (౨) కవితలు (వచన కవితా సంపుటి),<br>మాటవెలదులు (పరశ్శతకము),<br>ప్రపద్యాపీడము (ఖండ పద్యకవితా సంపుటి),<br>ఇష్టకథాష్టకము (కథాసంపుటి),<br>ముహూర్త కామేశ్వరము. మొ. |